# ఉపోద్ఘాతము.

———.o:———

"ఆరోగ్యకామేశ్వరి"

అను నామముచేతనే యియ్యది యారోగ్యార్థ మేర్పడిన కామేశ్వరీస్తుతియని స్పష్టమగుచున్నది కదా! ఇఁక నిది యెవరియారోగ్యమునకై యెవరు రచించిరను నంశమును గ్రంథమే వివరించెడిని. ఇందుఁగలపద్యములు రెండువందల కొకటిరెండుకన్న మించవు. ఇం దొకచో గ్రంథకర్తవయస్సు 50 వత్సరము లనియు వేఱొకట నఱువదికి దాదాపనియుఁ గన్పట్టుటంజేసి స్థూలదృష్టిగాఁ జదివికొనువారలకుఁ బరస్పరవిరోధము స్ఫురించెడిని. గ్రంథకర్త దీని నేఁబదివత్సరములప్రాయమున మొదలిడి యఱువదికిలోపునఁ బూర్తిచేసెనని గ్రహింపఁదగు. అగుచో నీస్వల్పగ్రంథమున కిన్నియేండ్లు పట్టెనా? యనుశంక కవకాశము కలిగెడిని. తత్త్వమిది- రోగప్రకోపసమయములయం దప్పుడప్పుడు వివశముగా దొరలిన కవిత్వమేగాని యియ్యది యిట్లు రచింపవలె ననునుద్దేశముతో దీక్షపట్టి రచించినది కాదని సమాధానము చెప్పికోఁదగు. సుమా రెనిమిది వత్సరములకాలములోని యీపద్యములనంశము జ్యోతిశ్శాస్త్రప్రవేశము కలవారలకు నిందలియంశములవలననే మిక్కిలి సుగమము. జననకాలమునకుఁ గొంత చంద్రమహాదశ భుక్తమైనది. శేషము సుమా రైదేఁడులు, పిదపఁ గుజమహాదశ యేడువత్సరములు. పిమ్మట రాహుమహాదశలో రాహ్వంతరము రెండువత్సరముల పైచిల్లర. వ్యాధిప్రారంభము చంద్రునిలోనే యైనను దానిప్రకోపావస్థ కుజదశాప్రారంభము మొదలుకొని కనుకఁ గుజదశ సర్వమును రాహువులో స్వల్పకాలమును ఈపద్యరచన కాస్పదమని విజ్ఞు లెఱుఁగఁగలరు- చంద్రదశలో సర్వసామాన్యముగా నున్నప్పుడు కేవలము మందులమీఁదనే యాధారపడి పిమ్మట నీయుపాయ ముపక్రమింపఁబడినది.

"ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ"

అని భగవద్గీత. మొత్తముమీఁద విచారింపఁగా నీవ్యాధి జననమాదిగా సుమారైదువత్సరములవఱ కొకరీతిగానుండి పిమ్మటఁ బదివత్సరములవఱకుఁ బ్రకోపావస్థలో నుండి పదపడి సుమారు రెండేం డ్లొకమాదిరిగానుండి యట్టుపైని రెండేండ్లు మిగుల నొగిలియుండి పదియేనవయేడు ప్రవేశించునప్పటికి నామమాత్రావశిష్టమైనదని చదువరులు గ్రహింపఁగలరు. ఇట్టిపెద్దవ్యాధులకు భగవదారాధనమే యౌషధసేవకన్న ముఖ్యమని నేను నిశ్చయించికొన్నాఁడను- మనపూర్వులుగూడ—

"తచ్ఛాంతి రౌషధై ర్దానై ర్జపహోమసురార్చనైః"

అని లిఖించియున్నారు- ఔషధసేవయు జరిగినది. వైద్యుల సమ్మానములును జరిగినవి. ఎన్నియేని జరుగుఁగాక, అవియన్నియు నొకతల, ఇది యొకతల; ఇదియే యెక్కుడుపనిచేసినదేమో యనికూడ నే ననుకొనుచుంటిని- కొమరునివిషయమున నే కాక స్వవిషయమునఁగూడ మున్నె నిట్లే ప్రయత్నించితిని. అయ్యది మాకామేశ్వరీ శతకమున నచ్చటచ్చట గోచరించెడిని- ఇందుఁగూడఁ బైసంగతి నొండొకపద్యము తెల్పెడిని- ఎవరో మహాదృష్టవంతులుతప్ప లోకములోని సంతానవంతులెల్ల నిట్లే శ్రమపడుదురుగాని కవులుపడిన పరిశ్రమ కావ్యరూపమును బొల్చుటచే నెల్లరకుఁ దెలిసెడిని- ఇతరుల దట్లు కాదు.

చ॥ కొడుకులఁ గల్గుదాఁక నొకకొన్ని దినమ్ములు చింత, నందనుల్
వొడమిన నాయువుల్ బలము బుద్ధియు విద్యయుఁ జాలఁగల్గఁగా
నుడుగనిచింత, కల్గి తను నోలి భజింపనిచింత; తండ్రి క
ప్పుడుఁ గడుఁ జింతసేయుదురు పుత్రులు శత్రులుగాక మిత్రులే.

అని యొకకవి చెప్పియున్నాఁడు.

నేను బందరులోనున్నకాలమున విశేషించి కవితాపరిశ్రమ సేయుటచే ననారోగ్యమేర్పడి స్వగ్రామము ప్రవేశించినపిమ్మట నీవ్యాసంగమునుండి పూర్తిగా విరమించితిని. అట్టిస్థితిలో నీరచన యనివార్యముగా ఘటించినది. ఇదియేకాక యనివార్యముగా— "మల్లేశ్వర విజ్ఞప్తి"

అను పేరున నొక యాఱువందలపద్యములుగూడ దొరలినవి- అవిగూడ నించుమించుగా నొకమాదిరి రోగాపనయనమునకే యుపకరించెడిని- కాని యీరోగమునకును దానికిని గొండొకభేదము కలదు- ఆభేదము నీక్రిందిపద్యము తెల్పఁగలదు—

మ॥ కొమరుల్ రోగవిముక్తుఁజేయుమని మ్రొక్కుల్ మ్రొక్కితి నీదు పెం
డ్లము కామేశ్వరి, కాజగజ్జననియు న్నాకోర్కె పూరించె; గ్రా
మమహారోగము వాపుమంచిపుడు నిం బ్రార్థించితి, "నీదుచి
త్తము నాభాగ్యము" పిమ్మటన్, దగదు మాంద్యమ్మందు మల్లేశ్వరా ॥ ౧

ఆమహారోగస్వరూప మెట్టిదోయని శంక కలుగకమానదు—ఆశంక నీక్రింది పద్యము తొలఁగించెడిని—

మ॥ కలరాగాని మశూచిగాని మఱి రోగాలేవియేఁగాని యీ
ఖలచిత్తుల్ బలె గ్రామముల్ జెఱుప, వీకర్మశ్వపాకాయతిన్
బల మేదింపఁగదయ్య! లోకులకు నాపత్కారు లీతుంటరుల్
నిలువెల్లన్ విషపుంజముల్ నిలుపుమీ నీచూపు మల్లేశ్వరా ॥ ౨

ఈరెండుకబ్బములును ననివార్యములగుటచే రచింపఁబడినవే కాని తదితరరచనకు బుద్ధి ప్రసరించుట లేదు- ప్రస్తుతము శ్రీ శ్రీ బొబ్బిలిరాజుగారి పట్టాభిషేకచరిత్రము రచింపవలసియున్నది- వాగ్దేవతానుగ్రహానుసారము తద్రచన నెఱవేరవలయును. ప్రస్తుతగ్రంథము తుట్టతుద నొకపద్య మీవిషయమున కంతగా సందర్భించునది కాకున్నను శ్రీ శ్రీ రావు రామయ్యాంబా బహద్దరు జమీందారుగారినిగూర్చి రచింపఁబడినది- ఇటీవల ననఁగా, బందరునుండి స్వగ్రామము ప్రవేశించిన కొలఁదివత్సరముల నుండి యిందనుక నన్ను నాయింటనె యుంచి నెలకు నిరువదియైదురూపికలవంతున నుపకారవేతన మనుపేరున నేవిధమైనప్రత్యుపకారము నభిలషింపకయే యొసఁగుచున్న కృతియుగదాత్రివతంసము నెడల నీమాత్రము కృతజ్ఞత చూపుటకు సంతసింపనివారుండరని నానమ్మకము- ఇట్లుచూపుట గ్రంథకర్తల యాచారమే—

"శృంగబేరపురాధీశా ద్రామతో లబ్ధజీవికః"

అని నాగేశోపాధ్యాయులు కృతజ్ఞతం దెలిపెను- నేను స్వయముగాఁ బ్రూఫు చూడకున్నను చాల నిర్దుష్టముగా దీనిని ముద్రించిన చంద్రికాప్రెస్సువారి నెంతయు నభినందించుచున్నాను.

కడియము, 20—10—'29.

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి,
శతావధాని.

౧౩౧ వ పద్యములోని 'దోశోగ' యనుపదము 'దూశోగ' యని సవరించుకొనుఁడు.



శ్రీమత్పరదేవతాయై నమః.

# ఆరోగ్యకామేశ్వరి

శా॥ అంబా! నాకుఁ గుమారుఁ డంట? భవదాఖ్యన్ దాల్చువాఁ డంట? వా
నిం బీడించెడినంట? దగ్గోకఁ డింకేని న్నీకటాక్షంబు మ
మ్మం బోషింపక తీరదమ్మ? యిదిగో? మ్రొక్కుల్ భవత్ప్రేమ మా
లంబం బిత్తుజెఁ గావలెన్ వలవ దాలస్యంబు కామేశ్వరీ ॥ ౧

శా॥ ఎన్నో మందుల నెందఱో భిషజు లెన్నే భంగులన్ జెప్ప నే
నన్నింటిన్ దగ వాడిచూచితిని, గానైతిన్ గృతార్థుండ, నా
కన్నమ్మన్నను దప్పియన్న రుచిలే దాత్మోద్భవుం డార్తుఁడై
యున్నన్, వీని నరోగుఁ జేయుటకునై యోజింపు కామేశ్వరీ ॥ ౨

శా॥ ఏదోచి కుక్కుదయింప ని న్నడుగుచే యే నేర్తు నప్పట్టునన్
నాదైన్యమ్మును బాపి నీవు కరుణన్మన్నించి రక్షింతు, నీ
పాదంబే శరణంబు పుత్రుని సుఖింపన్ జేసి రక్షించి యా
మోదం బీఁగదవమ్మ? నాకు సతతంబుం దల్లి? కామేశ్వరీ ॥ 3

మ॥ చిరకాలమ్మున కిచ్చి తాత్మజుని నీచిత్తమ్మెటో వచ్చి నీ
చరణారాధన సల్పి పేరిడితి నిచ్చల్ వానిఁ గామేశ్వరున్
బరిపీడించునె? దగ్గోకం డయినచో భక్తార్తిసంహర్త్రి? నీ
బిరుదం బేగతి సార్థకం బగుఁ గృపాబ్ధీ? తల్లి? కామేశ్వరీ॥ ౪

శా॥ నావంశమ్మునఁ దల్లి వంగడమున న్నానాఁడు పూర్వమ్మునం
దేవంకన్ వినరాదు శ్వాసరుజ వీఁ డిద్దానఁ జిక్కెన్ గడుం
జేవల్ గూర్చి నిరామయున్ సలిపి రక్షింపంగ నీ భార మిం
కే వైద్యమ్ములతోఁ బనే ముబుసుపోకే కాక కామేశ్వరీ ॥ ౨

మ॥ భయమున్ వైన్యము నా యెఱుంగనివి నాబాల్యమ్మునంనుండి నీ
శ్చయ మీసంగతి నీ వెఱుంగుదువు; మార్జారంపుదుర్ధ్వాన మె
చ్చు యిబ్బాలునికంతమందు వినరా నల్లంతనే నాకు ని
రయిపోవు న్నీలువెల్లఁ గుఱ్ఱనికి సౌఖ్యం బిమ్ము కామేశ్వరీ ॥ ౩

మ॥ తనుసౌఖ్యం బది నాకుఁ దక్కువయినన్ దర్పమ్ము గోల్పోవకే
జననీ ? కాలము పుచ్చుచుంటి, సుతుమార్జారంపుదుర్ధ్వాన మా
కను నిర్దర్పునిఁ జేయఁబూనె మిగులం బ్రార్థింతు నీపిల్లికిం
తను దూరంబొనరించి పుత్త్రునకు మోదం బిమ్ము కామేశ్వరీ ॥ ౪

మ॥ "జయ మొందెందును దా వహించుటయు నిచ్చల్ పుత్త్రు చేతన్ బరా
జయమున్ బొందుట హర్ష" మన్ననుడి కీసారస్యమున్ గూర్చు టా
శయ వేదుల్ విని సమ్మతింపరు కలాసంపత్తి నాకుం బరా
జయముంగూర్పుము పుత్త్రుచే రుజను నిష్కాసించి కామేశ్వరీ ॥ ౫

మ॥ నరకం బిచ్చెదొ? మోక్ష మిచ్చెదొ? తుది న్నాకీవు నాతల్లి? యీ
గుఱికన్ బిడ్డనిఁ జేరనీక యిఁక నాకున్ మోదమున్ గూర్చినన్
నరకమ్మున్ దరియించినట్లె మది నానందింతు బిడ్డండు శ్వా
సరుజ న్నెట్టిన నాకు నయ్యది యె మోక్షం బంబ? కామేశ్వరీ ॥ ౬

శా॥ అంబా? వైద్యుల కీరుజావిలసనం బడ్డంగ గడ్డంట? వై
ద్యంబుంబోలె భవత్కటాక్ష మసమర్థం బెందుఁ గాదంచు నా
కుం బాల్యమ్మననుండి మేటిగుఱి నాకుణ్ణుండు నీపేర్మిక
ల్మిం బీడన్ విడి సౌఖ్యమున్ గనుతఁ దల్లీ? యింకఁ గామేశ్వరీ ॥

శా॥ ఎంతో కార్యము కల్గికాక వృథగా నేఁ బద్యముల్ సెప్ప నా
చింతల్ దీర్చుట నీకు శక్యమనియే చెప్పన్ దొరంకొంటి నీ
స్వాంతం బించుక పుత్రుపై నిలిపి వాంఛాపూర్తి సేయంగదే ?
సంతానంబు నిరోగమైన భవమే స్వర్గంబు కామేశ్వరీ ॥ ౧౧

శా॥ పద్దెమ్ముల్ రచియించి కోరితి నిఁకన్ బ్రారబ్ధకర్మక్షయం
బిద్దానన్ గలిగించి నే సుతున కాయారోగముల్ బాపి దీ
ర్ఘద్దేహంబు బొనరించి ప్రోవుము కవిత్వం బిద్ది లోకమ్ములో
'సద్దివ్యౌషధ' మన్నపేరున యశస్యం బౌతఁ గామేశ్వరీ ॥ ౧౨

శా॥ ఆయుర్దాయము లేనివారలకె తా నాయుస్సిడన్ భర్త, త
జ్జాయాత్వమ్మున కీవు తావలమవై సంపన్నవౌ నాయువున్
జేయన్ జాలవె రోగదూరముగ, నీచిత్తమ్ము రా కిన్ని నా
ళ్లాయాసమ్మొదవెన్ ఘటింపు మిఁక సౌఖ్యం బంబ? కామేశ్వరీ ॥

మ॥ శతకమ్ముల్ రచియించి సూర్యుపయిఁ గుష్ఠమ్మూడ్చె నొక్కండు, ప
ద్యతతి న్నిన్ను నుతించి మూఁగతనముల్ దాఁ బాసె నొక్కండు, ని
శ్చిత మీసంగతి, మున్ను నీకతననే జీవించితి న్నేను, మ
త్సుతు నారోగ్యము నీకతాన నగు టేచోద్యమ్ము ? కామేశ్వరీ॥

శా॥ అంబా? యెందుల కిచ్చి తిట్టిసుతు, ని న్నర్థింపలేదే? మనీ
షం బూర్ణుండని సంతసించితునొ ? గురుశ్వాసార్తుఁడౌచున్ విచా
రంబుం బొందుదునో? షడబ్దముల కుఱ్ఱండేడ? యీరోగదా
ర్ఢ్యంబుం దానదియేడ? బిడ్డనికి సౌఖ్యం బిమ్ము కామేశ్వరీ॥ ౧౫

శా॥ పాపం బీయది నాయొనర్చినదియో? బాలుండె తాఁ జేసెనో ?
రేపున్నా మ్మిటులైన నెట్టు? లిది వారింపంగదమ్మా? సుమ
ప్రాపం బుండదు నీకు, నీచరణమే ప్రాపు, పన్యథా లేదు నా
తాపం బాపఁగదమ్మ? కుఱ్ఱనికి మోదం బిచ్చి కామేశ్వరీ ॥ ౧౬

మ॥ పడలే కారయ లేక యిర్వురము నిన్ బ్రార్థించుచున్నార మీ
చెడురోగమ్ము దొలంచి పుత్త్రిని సుఖాశీర్వ్యక్తుఁ గావించి నా
యెడఁదన్ సంతసపెట్టు మన్యగతి లేకే నిన్ను యాచించితిన్
దడ వింకన్ బొనరింపకే యిడుము నాతాపమ్ము కామేశ్వరీ ॥ ౧౭

మ॥ కొడుకుల్ గల్గనినాఁడు బుద్ధియయినన్ గొండంతగాకున్న వ
ల్గడలన్ గొండొకరైన సాయపడి నాకార్యమ్ములన్ దీర్చుచుం
డెడి దీపుత్త్రకుఁ డుద్భవించియు రుజానిర్మగ్నుఁడై బుద్ధికిన్
దడఁబాటున్ ఘటియించెఁ గుఱ్ఱనికి మోదం బిమ్ము కామేశ్వరీ ॥

మ॥ మును పీరోగము "వెన్ను కొంతముదురన్ బోవున్ ధ్రువం"బంచుఁ జె
ప్పినవైద్యోక్తుల నూఱడిల్లితి నెటో వెన్నట్టులౌ మీఁదఁ ద
గ్గనయీదగ్గన కేను బెగ్గడిలి నిన్ దక్కంగ వేఱొక్కఁడి
క్కు నపేక్షింపనివాఁడనైతి ధృతి నాకున్ గూర్పు కామేశ్వరీ ॥

మ॥ అరిగెం బో? యిదేఁడు లెక్ల్లో శశి యల్లంతన్ జనెన్ బిమ్మటన్
ధరణీసూనుఁడు వచ్చె "నింక సురుఁగున్ ద" గ్గంచు నే నుండఁగా
"సురుఁగన్ లేదు సరేకదా? మిగుల హెచ్చున్ జూపఁగాఁజొచ్చె నీ
కరుణాదృష్టియె పుత్త్రుఁ బ్రోవవలె నింకన్ దల్లి? కామేశ్వరీ॥ ౨౦

మ॥ జననీ ? యేఁబదియైనప్రాయమున నీసంతానదూరోగచిం
తను జేకూర్చుట నీకు ధర్మమగునే ? 'ధన్యుండు నేఁ' డంచు భూ
జను లెన్నన్ భవదీయసత్కరుణచే సంసారినై యుంటిఁ బు
త్త్రున కారోగ్య మొసంగి నన్ను నతిపాత్రుం జేయు కామేశ్వరీ॥

శా॥ తల్లీ ? త్వత్పదభక్తలౌ జనుల సంతానం బరుణ్ణంబు సం
పల్లీలాకలితంబు నంచుఁ దెలుపున్ బ్రాచీనపుం గబ్బముల్
దెల్ల మీన్మనడి మత్కుమారునెడ వర్తింపన్ వలెన్ దాన భ
క్తోల్లాసమ్ము ఘటింపఁగావలయుఁ జుమ్మోయమ్మ? కామేశ్వరీ॥

శా॥ భక్తుల్ రిక్తులెయై తదాత్మజులు సంప్రాప్తార్తులే యైనచో
'భక్తార్తిప్రద' యన్న దుర్యశము సంప్రాప్తించు నీకున్, ద్వదా
సక్తిన్ మానుదు రెల్ల, రట్లగుట నిచ్చల్ భక్తసంరక్షణా
సక్తిన్ వీడకుమమ్మ ? నీకిది యశస్యంబమ్మ ? కామేశ్వరీ॥

మ॥ శని బల్ దోషి కుజుండు పాపి రవి దుస్సంచారి జీవుండు దు
ర్మనసుం డైన మఱేమి నాకొమరు సంరక్షించు భారమ్ము నీ
పనియైనప్పుడు భీతి యేమిటికి ? నీపట్లన్ గ్రహంబుల్ భయ
మ్మున నీభక్తుల కిచ్చు నిచ్చలు సుఖంబుల్ తల్లి? కామేశ్వరీ॥ ౨౪

శా॥ ఈజన్మంబున గోంచెమే యనుము మున్నే జన్మమందేని నీ
పూజన్ బూర్తిగ సల్పనేఁ డది కతమ్మున్ జేసియే లోకమున్
బూజింపన్ గొమరుండు రుగ్ణుఁడగుటే పో ? లోప మిప్పట్ల నీ
తేజంబే కల దద్ది పుత్రు సుఖిగా దీవించుఁ గామేశ్వరీ॥ ౨౫

మ॥ ఇలువేల్పైనకతాన నీచరణమే యాస్యంబు మావంశమం
దలి యేకూనకునైనఁ గాని యిది క్రొత్తా ? మాకొలమ్మెల్ల నీ
చలువన్ జేసియె వృద్ధిగాంచెఁ గొమరున్ నాకం గదమ్మా? రుజా
బలమున్ దింపఁగదమ్మ పుత్రుఁ గరుణింపన్ రమ్మ ? కామేశ్వరీ॥

మ॥ ఒకపూటో? యొకరేయియో? పగలొ? యీయుద్రేకపుందగ్గు ద
గ్గక కుఱ్ఱండు సుఖమ్ముగా నెసఁగ ''మాకామేశ్వరీదేవి పు
త్రుకు రక్షించు''నటంచు, మీఁద మరలన్ దగ్గన్ మొదల్వెట్ట '' దే
వి కటాక్షింపద యింతదనక'' ననుచున్ వేఁడుండెఁ గామేశ్వరీ॥ ౨౭

మ॥ జననీ లోకములోని బాలకులు నిచ్చల్ దగ్గరే? యట్లు ద
గ్గిన నే నింతగ మొఱ్ఱవెట్టెదనె? యీ కిగ్గాడిమార్గాల ని
స్వనము న్నే వినఁజాల, దీని నణఁగింపన్ లేవె? నిన్నేను వేఁ
డిన దీమాత్రమ కాదె? నీ కిదియు గడ్డే? తల్లి? కామేశ్వరీ॥ ౨౮

మ॥ అవిలో మున్ను బిడాలరాక్షసుని దుర్వ్యాపారముల్ రూపుమా
పినమాటే నిజమేని నేఁడు కొమరున్ బీడించుసీపిల్లికూన్
తను వారింతువు దానఁజేసి మ దపత్యం బున్న తానందమున్
గను నిన్నుం దలయింతు నే నపుడు వేడ్కల్మీఱఁ గామేశ్వ

శా॥ “తగ్గుం ద”గ్గని యంటి “దేవిపయిఁ బద్యాల్ సెప్పినా”నంటి “
తగ్గుం గన్పడ దేమి?తండ్రి!”యనుచున్ దర్కించెఁ గుఱ్ఱాడు బఁ
సిగ్గయ్యెం బెఱవారుగూడ వినుటం లేలెమ్మ రారమ్మ నా
సిగ్గు న్నాసుతుదగ్గుచున్ దొలఁచి రక్షింపంగఁ గామేశ్వరీ॥ ౩౦

మ॥ చదువన్ వేయఁగ “యుక్తకాల”మని యాసంస్కారమాత్రంబ చ
య్యాదనం దీర్చితిఁ; గుఱ్ఱఁడిం బడికి నే నానాఁటి కినాఁటికిం
“బద”మంచన్నది లేద, యన్నిటికి నీశ్వాసామయాద్రేకమే
కద? విఘ్నం, బిది వాపి విద్య నొసఁగంగాఁ జూడు కామేశ్వరీ॥

మ॥ ఎపుడో నీకృప రాఁ బ్రయోజనము లేదీబాలుపై విద్యనే
రుపుకాలం బది దాఁటిపోవుపయి నీ రుగ్ణత్వముం బాపి నీ
కృప సూచింతువు గాక యక్కరము లెక్కింపం గడుంజిక్కు, “ఇ
టిపనిం గొడ్డటి” కేల తార్చెదవు నేఁడే చూడు కామేశ్వరీ॥ ౩

శా॥ “ఆలస్యా దమృతం విషం” బనెడి సిద్ధాంతోక్తి నీ వొప్పుచో
బాలుం వే గరుఁజెంపు మమ్మ? సుకలాభ్రాజిష్ణుఁ గావింపు మ
మ్మా?లోకుల్ నను “నీదుభక్తుఁ” డనుచుం మన్నించుసందర్భముం
బాలింపంగదవమ్మ? నీయుపకృతిం వర్ణింతుఁ గామేశ్వరీ॥ ౩౩

శా॥ “ఎన్నం డీచెడుదగ్గు తగ్గు” నని న న్నెల్లప్పుడుం బృచ్ఛసే
యు న్నాబిడ్డఁడు “కొన్నినాళ్ల”కని నే నోదార్తు నవ్వాని, నా
పన్నార్తిప్రశమావధాయితము నీవాత్సల్య మీనాడును
త్కీ న్నిల్పన్ వలె మత్కుమారకుని యార్తిం బాపి కామేశ్వరీ॥ ౩౪

ఆరోగ్య కామేశ్వరీ

శా॥ అంబా? నిన్నెవఁడేని నమ్మి చెడఁ డీయర్థమ్ము [illegible]మిఁ
దం బాటించిననీకృపాకలనచేతన్ విస్ఫుటం బయ్యెఁ బా
ద్యంబుల్ ముప్పదియైననాఁడు మొద లేతద్వ్యాధిభారంబు త
గ్గంబూనెన్ గామమునందు గొంత సుఖగాఁ గన్పట్టెఁ గామేశ్వరీ ॥

శా॥ ఇంతేకా దిటమున్న "మార్గమిది" యం చేర్పాటుగాకుండె నేఁ
డంతో యింతయు మార్గ మేర్పడినయట్లైతోఁచె నీమార్గ మిా
కాంతారాంతరచారినైన ననుఁ జక్కన్ గమ్యమున్ జేర్చి దు
శ్చింతాదూరుని జేయుఁగాత యిది నాఁ జేమోడ్పు కామేశ్వరీ॥ ౩౬

శా॥ ఇంత "న్నన్నను పేమ పేఁ" డనుచు నిఁ పీక్షింపఁగాఁ బోకు నా
సంతానమ్మును బీడవెట్టురుజ నిస్సందిగ్ధమై పీడు న
ల్లంతన్ పేడు కవిత్వమున్ సలిపి నిన్ యాచించుటల్ మాను "పు
ష్ప్యంతం" బన్నది "దాసరేః పదము"నేఁడా పుట్టెఁ గామేశ్వరీ ॥

శా॥ "సంతానమ్ము నొసంగితీరు" మని నిచ్చల్ నిన్నుఁ బేడింపతే
డెంతోకాల మపత్యభాగ్య మది లేకే యేను, నల్లంతలో
సంతానంబఁట ? కొంత నష్టమఁట ? శిష్టమ్మిర్వు, రం దగ్రజుం
డెంతే రుగ్ణతఁ గాంచఁ జూచి సయిరింతే? దేవి? కామేశ్వరీ॥ ౩౮

శా॥ వేనిన్ గ్రొత్తగ "నాకు నిమ్మ"నుచుఁ బ్రార్థింప న్నినున్ దల్లి?, యె
ద్దాని స్నిపిడితో ? యయాచితమ, తద్దన్ దానఁ దృప్తుండ నీ
వై నా కిచ్చినదానికే సుఖజయప్రాగ్భార మర్థింతు, "నా
పై నీచిత్తము నాదుభాగ్యము" కృపన్ బాలింపు కామేశ్వరీ ॥

మ॥ తమకున్ దక్కనిదానిఁ గోరుదురు సంతానంబు నెప్పట్లఁ బ్రా
జ్ఞమతుల్; దక్కెడిదాని నెట్టికుమతుల్ గాంక్షింప రట్లాట నో
యమ? యిందుంగల శ్లేష శ్లేష్మరుజయందైనన్ సమర్థించి నా
కొమరున్ దక్కనివానిఁజేయు మది నాకున్ జాలుఁ గామేశ్వరీ॥ ౪౦

మ॥ 'తమకున్ద' గ్గనియన్న చోట నుభయార్థమ్ముల్ "సుఖప్రాప్త్యముల్
కమనీయమ్ములు" నంచు నీవరయుచోఁ గళ్యాణి? నాతోఁ గలన్
గొమరున్ దగ్గనివానిఁ జేయుటయు దగ్గున్ మాన్పుటల్ గూడ యు
క్తము, పైసంగతి కేమి? దగ్గు నిపుడే తగ్గింపు కామేశ్వరీ ॥ ౪౧

శా॥ అంబా? నీదసుభక్తమండలికి శ్రేయం బబ్బఁగాఁ దన్ నినే
గంటేఁగాక తదాత్మజాతులకు? దీర్ఘంబైనయాయుష్యలా
భం బౌఁగావుత వారి కియ్యదియ నా బాలుర్ గృపన్ బ్రోచి న
న్నుం బాలించినదాని కేఁ దెలుపు సంతోషంబు కామేశ్వరీ ॥ ౪౨

శా॥ అంబా? నీకు జయమ్ము, నీసుతుల కత్యారోగ్యముల్, నీమన
మ్ముం బాలించెడిశంభుదేవునకు నామోదమ్ము నీపాదయు
గ్మంబుం గొల్చెడిమాదృశప్రజకు సౌఖ్యం బీవు మత్పుత్రుపీ
డం బోద్రోయుటఁ జేసి నాసలుపు నాట్యం బిట్లు కామేశ్వరీ ॥

శా॥ ఈవే పంపితొ? తాన వచ్చెనొకొ? చెపి? కేరళజ్ఞుండు చి
త్రాపూర్వాన్వయుఁ డర్చనాకుశలుఁ డారాధ్యస్వభావుండు సు
శ్రీవిష్ణుం డపమృత్యువారకుఁడు లక్ష్మీపత్యభిఖ్యుండు సౌ
ఖ్యావిర్భావుఁ డకారణంబ యిట, కంబా? నిన్న కామేశ్వరీ ॥ ౪౪

మ॥ అతఁ డేజాతకముల్ గనుంగొనక తా నాస్యమ్ము వీక్షించి యే
గతమే కా కఖిలంబు నాగతము వక్కాణించువిజ్ఞుండు, మ
త్సుతునిం జూచి విశేషసంగతుల నచ్చుం గూర్చినట్టుల్ వచిం
చి తగన్ శాంతికినై కడంగె నిది నీచేయూఁత కామేశ్వరీ ॥ ౪౫

శా॥ స్త్రీవిం గావు, పుమాకృతిం బొరయ, వీ చిహ్నద్వయాతీతమా
భావం బందవు, నిన్ను నెవ్వరని సంభావింతు నోతల్లి? భూ
దేవుల్ నీనిజరూప, మిందు నహి సందేహంబు, మత్పుత్రకుల్
బ్రోవంగా నిటువచ్చి తాత్మకవితన్ మోమోడి కామేశ్వరీ ॥ ౪౬

శా॥ ఏరూపమ్మునులేని తేజమున కేదే నొండు రూపమ్ము వ్యా
హారార్థమ్ముగఁ గల్పనల్ సలుపు టర్హావై్మనచో నెందు లో
కారాధ్యుల్ ధరణీసుపర్వు, లట నీ కైక్యమ్ము గల్పించినన్
ధీరుల్ మెత్తురుగాన నియ్యెడల సందేహింపఁ గామేశ్వరీ ॥ ౪౭

శా॥ ఆయీశాంతులు సౌషధాదులును దానాదిక్రియల్ సర్వమున్
శ్రేయం బంద నిమిత్తమాత్రములు, నీ చిత్తమ్మురా "నన్నియున్
డాయున్ శ్రేయము" లంచు నేనెఱిఁగియున్ ధైర్యమ్ము నిల్పంగ లే
కాయీతంత్రములన్ మెలంగుట మదంబా ? ప్రోవు కామేశ్వరీ !

శా॥ నాచాపల్యము లెక్కసేయక యెటో నాబిడ్డనిన్ బ్రోచి నా
వాచాదోషములన్ క్షమించి కొమరున్ వర్ధిష్ణుఁ గావించి యీ
నీచశ్వాసరుజన్ హరించి జననీ ? నేఁడెల్లి విద్యార్థిగా
నేచందమ్మ్మునో కృపన్ సలుపు జా గింకేల ? కామేశ్వరీ ॥ ౪౯

మ॥ ఇట ము న్నంబ ! భవత్కృపాకలన తా నీరీతిఁగాకున్కి ను
త్కటరోగాపనయప్రసక్తిమెయి విద్యాలబ్ధికై పొందు సం
కటపాటెల్లఁ దదార్తిపట్టునని నేఁ గైకొంచునున్నాఁడ, నిం
తటనైనన్ గొమరున్ గలార్థి సలుప న్నాకోర్కి కామేశ్వరీ॥ ౫౦

శా॥ ఆరోగ్యమ్మునుగూర్చి బిడ్డనికి నిత్యమ్మున్ బ్రియత్నించుచే
సారె న్నాపని యయ్యె, నీకృప నిఁకన్ శ్వాసామయ మ్మిట్టులే
నీత్రైపోయినఁ బాఠశాలకు సుతు న్నేఁబంపికోనెంతు, నా
చారంబు న్నటవేర్ప నేనిఁ బితృదోషం బంద్రు కామేశ్వరీ ॥ ౫౧

శా॥ "శ్రేయస్సు ల్బహువిఘ్నముల్, బడు లెటో చేర్వాలు నేర్పు, న్గలా
వ్యాయామమ్ములు దుర్లభమ్ములు భవత్పాదాబ్జసక్తిన్ గురు
స్థాయత్సత్కరుణావిశేషమునఁజూ ? ప్రాపించు విద్యాధనం
బోయమ్మా ? యటులూరకున్నఁ బిత నెట్లూహింతు) కామేశ్వరీ॥

శా॥ నీచేయంగలకార్య మంబ ? కొమరు న్నీరోగుఁ గావించుటే
నాచేయంగలకార్యమో ? కల కౌఁగి న్యత్నించుటే, పిమ్మటన్
వాచామాధురి లోనుగాఁగలుగుసౌభాగ్యంబు ప్రాక్సంచిత
పారిచర్యమ్మున నబ్బు, నేరిచిన మైశ్వర్యంబు కామేశ్వరీ ॥ ౨౩

శా॥ ‘ విద్యాలబ్ధి పురాకృతానుగతమై వేఱొక్కలా గెట్టులౌ
సద్యశ్శ్వాసరుజానివృత్తి ’ యనుచున్ శంకింతువో ? కర్మసం
పాద్యంబే సకలంబు, సత్య, మగుచో భక్తుల్ నినున్ వేఁడి ‘ యా
పద్యోగమ్ములు వాసి ’ రన్ననుడి కెవ్వాఁ డొప్పుఁ గామేశ్వరీ ॥

శా॥ ఈపైఁ గొన్నిదినాలదనుక రుజ తా నేకొంచెమో నిల్వని
మ్మోపై మున్పటిరీతి కాఁదగదుసువిమ్మా ? తల్లి ? యట్లైనచో
నీపైఁ జెప్పినపద్దెముల్ జగతిలో నింద్యమ్ములౌ, నాకు నీ
పారిపన్మాటయు మిథ్యయౌ, నెఱిఁగి నన్ బాలింపు కామేశ్వరీ॥

శా॥ నీకారుణ్యము పుత్రిపైఁ గలిగెనేనిన్ బారిజ్ఞనుస్సంచితా
స్తోకైనఃపరికరపరికల్పితరుజాదుర్దర్పముల్ దూరమై
సాకల్యమ్ముగ సురిక్కు, నక్కతన నోశర్వాణి మద్వాణికి
న్నాకు న్నీకు యశంబు, బిడ్డనికి నానందంబు కామేశ్వరీ ॥ ౨౬

శా॥ ఏ యామద్వయవేళకో నిశిని దా నీయామయ మ్మెప్పుడు
న్నాయాత్మోద్భవు నంటియున్నటులె కానవ్వచ్చెడిన్ దల్లిరో ?
సాయమ్ముం బానరింపఁబూనినపు డీజాగేల ? యీ దూరుజా
పాయమ్మున్ దుదముట్ట నెట్టి కొమరున్ బాలింపు కామేశ్వరీ ॥

శా॥ అమ్మా ? నమ్మిన నమ్మకున్న వినునాయాంతర్యమున్ దక్కరో
గమ్ముల్ కొండొక చిక్కువెట్టినను నీల్గన్ జేసినం గాని శ్వా
సమ్మం గాసము నాయువుం బెనిచినన్ సాంతత్యముం జేసి క్రూ
రమ్ముల్, వీని నడంచి పుత్రుని గృపన్ రక్షింపు కామేశ్వరీ॥ ౨౮

శా॥ ఆయుర్వృద్ధికి "నుబ్బసమ్ము గుఱు" తం చాయుఃకలావేదులం
దీయుద్దేశ మొసంగు నెల్లెడల, నీదృక్శ్వాసబాధాపరి
స్ఫాయద్దీర్ఘతరాయు వేమిఫల ? మంబా ? పుత్రిదీర్ఘాయువున్
శ్రీయుక్తంబు నరుగ్ణమున్ సలిపి నన్ జేపట్టు కామేశ్వరీ ॥ ౫౯

శా॥ అంబా ? యుబ్బసమన్న దైవతముకా, దట్లయ్యె నాయుఃప్రదా
నంబుల్ సల్పెడినంట ? నీవా ? జగదానందైకసంధానదీ
క్షుం బాలించెడిమేటిదైవతమ వీచండాలరోగంపు రూ
పంబున్ మాపి కుమారునిన్ మనుపలేవా ? సిగ్గు కామేశ్వరీ ॥

శా॥ 'ప్రారబ్ధ' మ్మనునట్టివాదమును నిన్ బాధింప దేమందువా ?
ప్రారబ్ధక్షయమైన హేతువున నే పద్యమ్ములన్ జెప్పఁగా
నారంభించితినేమొ ? నీపయి ; నిజం బౌఁగాక కాకుండుఁగా
కీరోగ మ్మెటులేని నీ వుడిపినట్లే యొంతుఁ గామేశ్వరీ ॥ ౬౧

మ॥ తిరుపత్యద్రిపతిన్ భజించుటలు నీదివ్యాంఘ్రిపూజల్ మహా
త్తరముల్ దక్షిణతీర్థయాత్రలును 'వ్యర్థ' మ్మంచు లోనెంచదే?
నరలోకం, బౌక కర్మవాదమె జగన్నాథత్వముం బూనుచోఁ
బరిశీలింపుము పుత్రుఁబ్రోవుము రుజన్ భంజించి కామేశ్వరీ॥ ౬౨

శా॥ వేదాంతమ్ములఁ గర్మవాద మది యుర్విన్ సుప్రసిద్ధంబ, నీ
కాదుర్వాదముతోఁ బనే, మదియు నిన్నడ్డన్ సమర్థంబె ? ని
న్నే దీనమ్ముగ వేఁడికొంటి, సకల మ్మీ వేర్తు వీ వెట్టులో
నాదుర్యోగముఁ బాపు పుత్రి నరుజున్ గావించి కామేశ్వరీ ॥ ౬౩

శా॥ అంబా ? నీదగుమాయలోనినిజ మావంతేనియున్ గానరా
మిం బూజ్యుల్ ఋషు లిన్నిమార్గముల నెమ్మిన్ ద్రొక్కి, రేవన్నఁ ది
మ్మిం బమ్మిన్ మఱి బమ్మెఁ దిమ్మిగను బల్మిన్ మార్పఁగానేర్తు ; శ
క్యంబే నీకఖిలంబు, పుత్రు నరుజున్ గావింపు కామేశ్వరీ ॥ ౬౪

శా॥ తల్లి ? యెల్లెడఁ గర్మవాదము జయస్థానమ్ము గైకొన్న సం
పల్లాభమ్మునకై, జయాప్తికిఁ, గలాపారంపరీలబ్ధి, గా
పల్లీనత్వనివృత్తికిన్ జనులు నిన్ బ్రార్థించుటల్ వట్టియాఁ
గల్లా నీ నిజసత్త్వ, కానఁ గొమరుం గాపాడు కామేశ్వరీ ॥ ౬౫

శా॥ 'మానుంబిల్లియొ! మట్టుఁబిల్లియొ,' యనున్ మన్నించి మత్పుత్రకు
న్నీనేర్పుంగతి నీరుజున్ సలుపుమే నిన్నేను బ్రార్థింతు, నీ
తో నాకేటికి శాస్త్రవాదములు, నాతో నీకుఁ బంతంబె ? నా
పై నీకుం గలపేర్మిఁజూపి కొమరుం బాలింపు కామేశ్వరీ ॥ ౬౬

శా॥ 'ఆరోగ్యం బిడఁబూనె నంబ' యని నే నానందముం బొందఁగా
నారంభించితి, నంతలోన రుజ పూర్వాకారముం దాల్చె నేఁ,
డీరీతిన్ బలుసారు లయ్యె మును ? పిడ్డే క్రొత్త గన్పట్టె ? నీ
కారుణ్యమ్మది రాద యింతదనుకం గళ్యాణి ? కామేశ్వరీ ॥ ౬౭

శా॥ ఏమందో యిసుమంత వాడునెడఁ దా నీరీతి యారోగ్యమున్
సేమమ్ముం గనుపట్టి మీఁద నెపుడో చీకాకుగా మాఱుటల్
నేమంబే మును పీరుజానుగతికిన్ ; నేఁడేమి నీసత్కృపా
సామర్థ్యమ్మున నయ్యె ? నీకృపయె రా జాగయ్యెఁ గామేశ్వరీ॥౬౮

మ॥ కరి రక్షించినవిష్ణు వుండ, నల మార్కండేయు రక్షించుశం
కరుఁ డుండ, న్నిను దేవురించుకతమున్ గన్పట్టి 'మాయింటిదే
వర' వన్ సంగతి జ్ఞప్తిఁదెచ్చికొని నాబాలున్ గృపన్ జూచి యీ
గుటికన్ మాన్పఁగదమ్మ ? యిష్టయిన జాగు న్మాని కామేశ్వరీ ॥

మ॥ ఇలువేల్పాటన శంకరాదుల మదిన్ వీక్షింప కీనిన్ను ని
చ్చలు వేధించుట గాదు 'తండ్రికరుణన్ సాధించుకన్నన్ గదున్
సులువౌఁ దల్లికృపన్ గడించు' టనియున్ జుమ్మట్టిచో జాగిటుల్
సలుప న్యాయమె ? బిడ్డపైఁ గృప నొకిన్ సాగింపు కామేశ్వరీ ॥

మ॥ ఇతరోపాయ మొకండు కల్గునెడ నిన్నెవ్వాఁడు వేధించు ? మ
త్సుతునారోగ్యముకోస మెన్నిగతులో శోధించి శోధించి పై
నితికర్తవ్యము 'నీపదాబ్జభజనం బే' యంచు లో నెంచి నిన్
బతిమాలన్ దొరఁకొంటి నాసుతు నొగిన్ బాలింపు కామేశ్వరీ ॥

మ॥ ఇలువేల్పౌనిను వీడి యేసురలనో యే నిప్డు వేఁడంగ, 'మీ
యిలువే ల్పుండఁగ మా కిదేటికొడ' వం చేమందురో ? వారు, నా
కలుషమ్ముల్ హరియించి, నాకొమరుపైఁ గారుణ్యము న్నించి, మేల్
బల మారోగ్యము నీవ యీవలెఁజుమీ ? ప్రార్థింతుఁ గామేశ్వరీ ॥

మ॥ 'ఇలువే' ల్పంటకు నర్థమేమి? చెపు మోయీశాని? తన్గొల్చునే
స్తులఁతన్ జెందకయుండఁజూచుటయుఁ దా నర్థాన నవ్వానిపూ
జలు గైకొంటయుఁగాక యన్యమగునే? శ్వాసామయం బూడ్చి ని
చ్చలు నాపుత్రుని బ్రోచి నాసలుపునర్చల్ గొమ్ము కామేశ్వరీ ॥

మ॥ 'నను వేధింపఁగఁబోకు మీరుజలకు న్నా కేమిసంబంధ మే
జనుకర్మ మ్మెటువంటి?, దట్టిద రుజాసంసర్గమౌఁ, దత్క్షయ
మ్మున నారోగ్యము గల్గు' నంచనెదవేమో ? యట్టిదేమైన నే
నిను వీడన్, విడి నాయొనర్చుపనియున్ లే దంబ ? కామేశ్వరీ ॥

శా॥ "నీకన్నం బిడఁ బెద్దమొ"ట్టనుటయున్ "నేఁ డిందు నేఁడిందు"నం
చాఁకొన్నాతఁడుగూడ నొట్టిడుక తా నచ్చోటనే మెక్కు న
ట్లీకర్జమ్మున బాడయాచకుఁడనై యే నిన్ను నర్థింతుఁ జు
మ్మోకళ్యాణి ? సుతార్తిముక్తికెర వొం డూహింపు కామేశ్వరీ ॥

శా॥ "నీకుం బోవదు నాకుఁ బోవదు" వృథా నీకేల జాలంబు యా
చ్నాకార్యంబు "పురస్కృతావమతి పశ్చాత్కృత్తమానం, బటం
చీకాలమ్మునఁ గాద, పూర్వయుగమం దెందున్ బ్రసిద్ధంబ యం
బా ! కాఠిన్య మిదేల ? బిడ్డనిఁగృపన్ బాలింపు కామేశ్వరీ ॥ ౭౬

శా॥ ఏకోశమ్మున నేనియున్ దయ లవంబే నున్న వేల్పేని దా
నేకొం తేనియు గర్భమాచకునిపై దృష్టి న్నిగుడ్చున్ ధ్రువం
బీకార్యమ్మున గర్భయాచకుఁడ, నా కీ విశ్వాస్పితం బిప్పడే
లేకున్న న్నిను వీడఁ, బుత్రుఁ డెటు తల్లి న్వీడుఁ గామేశ్వరీ॥ ౭౭

మ॥ గతి వేఱొక్కటి లేక పుత్రు నరుజన్ గావించు భారమ్ముఁ బూ
న్చితి నీపై; నటు నీకృపాగరిమ వానిన్ జేయుచో వాఁడు " పం
డితపుత్రుం " డనుదుర్యశంబు గన, కానిందోక్తి నాయందు సం
గతమై సద్యశ మబ్బఁ జేయుసొబగున్ గల్పించుఁ గామేశ్వరీ ॥ ౭౮

మ॥ అతిథుల్ వచ్చిన గారవింపను? యథార్థాంబుల్ నివర్తింపనో?
మతి నీపై భయభక్తిసంభ్రమము లేమాత్రమ్మునున్ లేవా? దు
ర్గతులన్ జూచి విచారమందనో? వృథాగా నేటి కోయమ్మ? నా
సుతు రుగ్ణుం బొనరించి నాహృదయమున్ శోధింతు కామేశ్వరీ॥

శా॥ నాయారోగ్యమునందు లోపశతమున్ గన్పట్టనీ నీకు నే
నాయాసం బిడి పీడగొల్పుటలు లే, దాత్మోద్భవుం గూర్చి యే
నే యాచించుట; వ్యాధి నొందనుక వాని న్బ్రోచు నందాఁక నీ
కీయాచ్ఞాపరిపీడ తప్ప దిఁక నీయిష్టంబు కామేశ్వరీ॥ ౮౦

శా॥ కాసశ్వాసలనైన నైఁచి నిలువంగావచ్చు నొక్కంట, యా
చ్ఞాసారస్యనిరాదృతిప్రచలదుచ్ఛ్వాసంబు సద్గోత్రజుం
డై సైరించినవాఁడు గన్పడఁడు, నీ కంబా? యసద్గోత్రజా
భ్యాసం బేటికి? వేగ నాకొమరునిన్ బాలింపు కామేశ్వరీ॥ ౮౧

మ॥ నెల కేనిన్ మును రెండుమాసముల కేనిన్ మూటికే నెట్టొ యీ
పిలికూఁతల్ విననై చికిత్సకతనన్ బీడించుటల్ మానుటల్
గల, దిప్డో ప్రతిరాత్రియున్ గనఁగనై కారింపఁగాఁజొచ్చె; నీ
కలుషార్తిన్ హరియించి నాకొమరునిన్ గాపాడు కామేశ్వరీ॥

శా॥ అంబా ? యేఁబదివత్సరమ్ములవయ స్సాయెన్, సుఖంబుల్ దద
న్యంబుల్ మున్ననుభూతముల్, నిజముగా నాజన్మమం దిట్టిక
ష్టంబౌ కాలము చూడలేదు, సుతుఁ డీశ్వాసామయం బూఁడ్చి సౌ
ఖ్యంబు న్నాకిడనోపు, నయ్యది త్వదాయత్తంబు కామేశ్వరీ ॥

శా॥ నాకుట్టిన్ సుఖిగా నొనర్చి యిటుపై నాకుట్టకే కాక యీ
పాకమ్మున్ బగవానిబిడ్డకయినన్ వర్తింపనీ కమ్మ ? నే
నే కా దంబరొ ? నీవుగూడఁ గొమరుం డిట్లార్తుఁడే యైనచోఁ
గైకోలేవు సుఖంబు, నాకొమరునిం గాపాడు కామేశ్వరీ ॥ ౧౮

శా॥ దగ్గన్ సూచన యైనవెంటనె మదిం దాపోదయం బౌ, మఱి
న్నిగ్గుల్ దేఱినమానసం బఖిలమున్ స్నికౌ, బిడాలధ్వనుల్
బిగ్గన్ దోఁచినఁ గోప ముప్పతిలు నోవిశ్వాంబ? న స్నిగతిన్
స్సగ్గన్ జేయక పుత్రునిన్ మనిచి యాశ్వాసింపు కామేశ్వరీ ॥ ౧౯

మ॥ "ఇది యేమో! పొనరించు" నంచు మదిలో నేమేని భీతిల్లి నీ
మదయన్ వేఁడుటగాదె సూ? జనని? మృత్యుప్రాపకం బిద్ది గా
దెదగున్ దీనికతాన నాయు, వగుఁగా కేలాభ? మీ జీవనం;
బదయత్వమ్ము వహింప కార్తి నుడుపన్ యత్నింపు కామేశ్వరీ ॥

శా॥ సంగీతమ్మునయందు సాహితియెడన్ జాతుర్యమెల్లెని య [త్రి]మే
బ్బంగా కంబరొ ? వాక్ప్రవాహ మెటు లుప్పొంగున్? రుజామా
యంగీకారము గాదు, శ్వాసరుజయో? యత్యంతశత్రువ్రజం
బుంగైకోఁదగ దీరుజన్ మలపు; మబ్బున్ హాయి కామేశ్వరీ॥ ౨౧

శా॥ విద్యాగోష్ఠికె కాద, యేపనికిఁ బృథ్విన్ రోగి పాత్రుండు గాఁ
డుద్యచ్ఛ్వాసరుగార్తుఁ జెప్పవలెనే ? యోయమ్మ? నీకేల నా
పద్యంబుల్ మొఱవెట్టికోవలయు ? సర్వజ్ఞత్వ మున్నప్పు, డిం
కుద్యోగించి కుమారుని న్ననుచుచో పూహింపు కామేశ్వరీ ॥

శా॥ నాయీప్రస్తుతదుస్థితిన్ గనిన-చో నాతల్లి ? సంతానమం
దేయజ్ఞుండును వాంఛఁబూనఁ, డిది యేమిా ? సిదయోద్రేక మి
క్లీఁయె న్నాయెడ, జీవితంబు తుద కిట్లా? నేను వేగించుటల్
"ఛీ"యన్పింపక వేగ నాకొమరుగాసిన్ మాన్పు కామేశ్వరీ॥ ౮౯

శా॥ అంబా ? "మార్గ మొకండు చిక్కె"నని నే నానందమున్ జెంది ప
ద్యంబు ల్నీపయిఁజెప్పి రోగతరణం బర్థించితిన్ మున్ను వి
ఘ్నంబున్ దానికి సంతరించి, తయినం గానిమ్ము వేఱొక్క-మా
ర్గంబు ల్నీవ యనుగ్రహించి కొమరున్ గాపాడు కామేశ్వరీ॥ ౯౦

శా॥ ప్రత్యక్షమ్మయి దేవతల్ నొడువు టీపాపిష్ఠకాలమ్మునం
దత్యంతమ్ము నసంభవం బగుట స్వప్నాదిస్థితిన్ జెంది సా
మత్యంబూని సుతార్తివారణకు నంబా ! యొం డుపాయమ్ము ను
ద్దీప్తత్యంతప్రవణమ్ముగా నొడువరాదే ? దేవి ? కామేశ్వరీ ॥ ౯౧

శా॥ చోటున్ మార్చిన "వ్యాధి తా సురుఁగు" నంచున్ వైద్యు లం
[చుండి రీ
మాటన్ బట్టి చరింపునుందువా ? యెదేమం దీడనే వాడ నా
నాఁటన్ గల్గు నరుగ్ణభావ మనెదో ? నాతల్లి ? సూచించి యా
రాటంబుం దొలఁగించి బిడ్డనిఁ గృపన్ రక్షింపు కామేశ్వరీ ॥ ౯౨

శా॥ ఇచ్చోటన్ గల, వచ్చటన్ గలవు నీ వెచ్చోట లేకుంటి మ
మ్మిచ్చో నుంచి నిరామయత్వపద మిా విప్పింపలేవొక్కొ ? నీ
యిచ్ఛన్ సర్వము సిద్ధమౌ, నిది నిజం బీక్షింపు, మిావంక, కీ
యుచ్చైచ్ఛద్దారుజ బిడ్డనిన్ విడిచి యెందే డిందుఁ గామేశ్వరీ ॥

శా॥ ఆర్తుల్ లోనగువారు నిన్నడుగు టాయాకోర్కెల న్నీ వొగిన్
బూర్తిన్ జేయుట సుప్రసిద్ధమకదా ! పూజింతు నిన్ మత్కుమా
రార్తిన్ బాపఁగదమ్మ ! వీనికిఁ గలాభ్యాసావకాశంపు వి
స్ఫూర్తిన్ దేఁగదవమ్మ ? నీదుపదముల్ పూజింతుఁ గామేశ్వరీ॥

శా॥ అంబా? యీరుజయన్న ని కలలులాయంబో? బిడాలంబో? యా
లంబున్ జేసి మరల్పఁగావలెనె ? హేలామాత్రసాధ్యంబ, నీ
చం బీరోగము నీకటాక్ష మఱపీసం బేనియుం జాలు దీ
నిం బోకార్పఁగ, మత్కుమారునకుఁ గాంతింగూర్పఁ, గామేశ్వరీ॥

శా॥ సృష్టింపన్ భరియింప శక్తిగలనీద్భ్రూకోణపుంగల్మి, కే
కష్టం బీరుజ మాన్పుటన్న, గళలగ్నక్ష్వేళుఁ డీశుండు నీ
దృష్టింజేసియెకాదె మృత్యుజయు మర్ధిన్ జేసి వర్ధిష్ణుఁడై
పుష్టింగాంచెఁ, గటాక్షమించి కొమరున్ బోషింపు కామేశ్వరీ॥

శా॥ రక్షింపంగల నే నెఱుంగుదును క్రూరమ్మైనయీరోగముల్
శిక్షింపంగల, వంతెకాదు కొమరుల్ జేతోముద మ్మొప్పఁగా
వీక్షింపంగల, 'వింటివేల్పనుచు మాపెద్దల్ వృథాగొల్చిరే ?
సాక్షాత్కల్పక మీవు, పుత్రు మనుపన్ జాగేల ? కామేశ్వరీ॥

మ॥ వయ సిప్డేఁబది దాఁటు నావిషయమై పార్థింపఁగాఁబూనుచో
నయవేదుల్ విని సమ్మతింపరు, సరే; నాపుత్రునిన్ గుఱ్ఱనిన్
దయతోఁ బ్రోచుట సర్వసమ్మతముకాదా? తల్లి ? కొంకేల? బల్
రయమొప్పన్ రుజ మాన్చి చేవ నిడి కుఱ్ఱన్ బ్రోవు కామేశ్వరీ॥

శా॥ పాలన్ ముంచిన, నీట ముంచినను నీపాదంబె దిక్కమ్మరో?
చాలు న్మాలము లేనియీరుజను 'నిష్ఠాసింతు' వంచెంచి ప
ద్యాల న్నిరయిఁజెప్పినాఁడ, నపహాస్యత్వమ్ము చేకూర్తువే?
చాలున్ జాలు రుజాపనుత్తికి నిఁకం జాగేల ? కామేశ్వరీ॥

శా॥ ఆరోగ్య మ్మలరారునాయువులు సౌఖ్య మ్మిచ్చు, నారోగ్యవి
స్తారంబై యెసలారుసంతతియె మోదం బిచ్చు, నారోగ్యదు
ర్వారంబై తనరారుసంపదయె సర్వ మ్మిచ్చు నారోగ్యమే
కోరంగాఁబడె నాదుసంతతికి నీకున్ మ్రొక్కి కామేశ్వరీ॥

శా॥ నీపై భారము వెట్టి యీశతకము న్నీకిచ్చితిన్ దీని నిం
కీపై వ్యాపృతి నందఁజేసెదను నీవే కీర్త్యకీర్తుల్ రుజా
సాపత్న్యంబుఁ దొలంచి యాయువునెడన్ సంపూర్ణతన్ బెంచి స
ర్వాపత్తుల్ దొలఁగించి పుత్రు మనుపం బ్రార్థింతుఁ గామేశ్వరీ॥

శా॥ రక్తిన్ జెందఁగ ముక్తిఁ బొందఁగ రుజారాహిత్య మింపొందఁగా
భక్తిన్ జెందఁగ నాకు సర్వమునకున్ బద్యమ్ములే దిక్కు నా
వ్యక్తావ్యక్తత లీ వెలుంగుదువు బాల్యమ్మాదిగా, రోగని
ర్ముక్తుం బుత్రు నొనర్పు మీశతక మామోదించి కామేశ్వరీ॥

శా॥ అంబా? యీశతకావసానసమయమ్మందున్ యతీశుండు వ
చ్చెం బూజించితి మద్గృహమ్మునన నిల్చెం గొన్నినా, ళ్ళిష్ట శ్రా
వణంబున్ గానముఁ బుత్రి నొంచుతఱి, తత్సంయమ్యఘశాంత్రఘ్ని
రం ఖిం తిచ్చితిఁ బైని గన్పడె సుఖారంభంబు కామేశ్వరీ॥ ౧౦౩.

మ॥ ఒకపక్షమ్ము గతించె నిప్పటికి నంతో యింతో యేమందా పు
త్రకు నాకించుచునుంటి, సౌఖ్యముగఁ గుట్టుం డొప్పుచున్ బాఠశా
లకుఁ దానై చనుచుండె, నీవ యతిలేలన్ బ్రోచితం చెంతుఁ బు
త్రకు నారోగ్యము శాశ్వతంబుసలుపన్ బ్రార్థింతుఁ గామేశ్వరీ॥

శా॥ దేవబ్రాహ్మణభక్తి యీయుగమునందే తక్కువై పోయె నిం
దేవాఁడేనియు మగ్నుఁడౌ నెడల "వీఁడే వాతులుం" డంద్రు పై
నీవున్ వారికి సాయమౌనెడల వేఱే చెప్పనా? భక్తపా
ల్లో విశ్వాంబ? కుమారు మన్చి నను ధన్యుం జేయు కామేశ్వరీ॥ ౧౦౫

మ॥ కలికాలమ్మునఁగూడ వేలుపుఁగృపల్ గష్టమ్ములం దీర్చుటల్
గల దన్నందుకు నిద్ది లక్ష్య మయినంగావచ్చు నీరోగదు
ర్బలమున్ మాపి కుమారునిన్ మనిచి మేల్ప్రఖ్యాతి నైకొమ్ము, న
న్నలరన్ జేయుట కీర్తికిం దెరవు సుమ్మా? యమ్మ? కామేశ్వరీ॥

శా॥ గోచారాదిక మింతకన్న నిఁకముం గ్రూరమ్ముగా నున్నటుల్
దోఁచెన్, నీకరుణాకటాక్ష మది పుత్రుం బ్రోవనున్నప్పు డా
యాచారమ్ముల లెక్క యేమి? యభయం బే యింక మాకున్, సుఖ
ప్రాచుర్యంబ భవిష్యదర్థమని సంభావింతుఁ గామేశ్వరీ॥ ౧౦౭

శా॥ శాంతిన్ జెందినయట్టులుండి మరలన్ శౌర్యంబు చూపించె మొ
న్నంతో యింతయొ యీరుజాప్రసరణం; బడ్డట్లు వారించి ని
స్స్వాంతం బేమఱనెక్కొ? బంద యిది, యీచండాలరోగంబు త్వ
త్ప్రాంతంబంద యడంచిపట్టవలె భద్రం బంబ? కామేశ్వరీ॥

శా॥ అంబా? పద్యమె చెప్పఁగోరి యొకపద్యంబేనియుం జెప్ప వాం
ఛం బూరింపనిఱేఁడు లేఁ డెచట నోశర్వాణి? నీమీఁదఁ బ
ద్యంబుల్ నూటికి మించఁ జెప్పితిని పుత్రారోగ్యసంసిద్ధి వే
గం బాటిల్లుత, నీకృప న్నగసుతన్ గావ్యంబు కామేశ్వరీ॥

శా॥ ‘ఈపద్యమ్ములపుట్టు విట్టి, దివి యీకృత్యమ్ము సాధించె, నే
యేపద్యాళిఁ బఠింత్రు శ్వాసరుజ వా రేనాఁడునుం గాంచ’ రం
చేపట్టన్ గొమరుండు శిష్యులును సర్వేద్యమ్ముగాఁ జెప్పికో
నీపద్యమ్ములకున్ జయ మ్మొసఁగు మోయీశాని? కామేశ్వరీ॥

మ॥ చెవుడేలన్ గలిగింపు మమ్మ? సుతుపైఁ జేసాచు మార్జాలపుం
రవమే నిం దొలఁగింపు మిద్ది పితృకర్ణస్ఫూర్జదుగ్రాయ, మీ
రవ మే తండ్రి సహించు? దీని మదగర్వ మ్మాడ్చి మత్పుత్రకున్
శివమారోగ్య మొసంగి ప్రోవఁదగదే? శ్రీమీఱఁ గామేశ్వరీ॥ ౧౧౧

మ॥ జననీ? నీకృపకల్మి శత్రువుల నిచ్చల్ గెల్చితింగాని పు
త్రుని బీడించెడి శ్వాసరోగమయశత్రుం గెల్వలేనైతి నిం
దనుకన్; దీని కుపాయముం దెలిపి నాతాపమ్ముఁ బోకార్చి కు
ఱ్ఱని కారోగ్య మొసంగు మియ్యదియ నిన్ బ్రార్థింతుఁ గామేశ్వరీ॥

శా॥ ఏకార్యమ్మున కేను బూనినను దల్లీ? నీదయోద్రేకను
శ్రీకల్మిన్ దనయంతఁ దా నయిసటుల్ సిద్ధించుటేకాని యీ
చీకాకెప్పటి కే నెఱుంగ, నెటులో చేపట్టి రక్షించుటల్
నాకు న్నీకును నాకుమారునకు ధన్యత్వమ్ము కామేశ్వరీ॥ ౧౧౩

శా॥ ఎన్నన్ గుఱ్ఱనిజాతకం బొకటి కాఁ డీశాని; నీజాతక
మ్ము న్నాజాతక మిన్ని చక్కఁబడినం బూర్ణమ్మగుం గోర్కె యుం
చు న్నాకున్ విదితంబ, నీకరుణ కెచ్చో లే దసాధ్యంబటం
చు న్నానమ్మిక బిడ్డపైఁ గరుణ వచ్చుంగాక కామేశ్వరీ॥ ౧౧౪

శా॥ లే కెన్నాళులో లేకలేకయె భవల్లీలాకృపావాప్తిచే
నీకుఱ్ఱం డుదయింప నేమిటికి? వీఁ డీలాటి ఘోరామయ
ప్రాకట్యమ్మునఁ జిక్క నేమిటికి? నాపాపంబా? నీలోపమో?
నా కీతాపము వాపకుంటివిగదా? నాతల్లి? కామేశ్వరీ॥ ౧౧౫.

శా॥ సన్యాసంబు వహింపు మందువొ? గృహాసక్తిన్ విసర్జించి యీ
యన్యాయమ్మును జూడఁజాల కెటకే నల్లంతఁ బొమ్మందువో?
మున్యారాధితమైననీదు మహిమమ్ముం గూడ నాబిడ్డకున్
ధన్యత్వ మ్మిడఁజాలకున్న నిఁక నాదారేది? కామేశ్వరీ॥ ౧౧౬.

మ॥ చదువు న్నేర్పుట పథ్యపానములు నిచ్చల్ నేర్పులే, నీతులన్
గుదురం జెప్పుట చుట్టకాల్పుపయిఁ గోర్కుల్ గాల్పులే, కాఁగ నా
కుదయించెన్ గొమరుండు నీదయనొ? కర్మోద్రేకమో? హేతువై
యెదియుం దోఁపదు నిద్రలేదు నిశలం దేమందుఁ? గామేశ్వరీ॥

మ॥ పగట న్నిద్దుర, రాత్రి జాగరణమై, ప్రారబ్ధకర్మక్షయం
బగుపట్టన్ దుదిలేక నాపడెడికష్టావస్థ నీచిత్తమె
ప్పగిదిం దాఁజొరదయ్యె, నాసలుపునీపద్యమ్ములెల్లన్ వృథా
యగునో? లేక ఫలించునొక్కొ? కృతకృత్యత్వమ్మె కామేశ్వరీ॥

శా॥ అంబా? యీరుజచేఁ జరిత్రిపురుషుం డైయొప్పెఁ గుట్టాఁడు, ప
ద్యంబుల్ నీపయి నిన్ని వేసికయి చేయంబూను టీదూరుజా
సంబంధమ్మునఁగాదె? చేకుఱె, భవిష్యత్కాల మారోగ్యభో
గ్యంబౌఁగాక, గతమ్ము సర్వము నగణ్యంబాతఁ గామేశ్వరీ॥

మ॥ ఎవ రెట్లున్నను దేశపర్యటనమం దే నుండునాఁ రోజులన్
లవలేశమ్ము విచారమే యెఱుఁగ, బాల్యంబాదిగా దేశముల్
కవితాకేళికిఁ ద్రిప్పిత్రిప్పి, యిపుడేకా? యిల్లువట్టించి, తీ
తెవులా? యింతటఁ జిన్నికుట్ర కిఁక నేదీ? దారి, కామేశ్వరీ॥

మ॥ అరియేనిన్ శ్రమమందుచున్న యెడ నే హర్షింప, నిక్కమ్ము దా
నెఱుఁగు న్నీమది, శ్వాసకాసల నిటుల్ కృచ్ఛాతికృచ్ఛమ్ముగా
ముఱిపంబున్ గొమరుండు కస్తివడ, నామోహెఁ దెట్లు నే వింక? నె
క్కరణిన్ సంస్కృతిసేతు? బిడ్డనికి సౌఖ్యం బిమ్ము కామేశ్వరీ॥

శా॥ చావన్నన్ భయమంద, రోగమనన్ శంకింతు, నిప్పట్ల నా
కేవాకేనియు నొక్కటే, వృథగ న న్నేలింకఁ బ్రేలింతు?, వే
త్రోవో త్రొక్కి యశస్సు దుర్యశమొ యేదోయొండు కైకొమ్ము,స
వే 'వే'ల్పంచు నుతింతు, నెంములకు నీవేపూట కామేశ్వరీ॥

మ॥ అతిశేషమ్మునఁ బ్రోచుచో జగమునం 'దంతాదరం బుండ దీ
స్తుతియం'దంచుఁదలంచి జాల నిటు లిచ్చోఁ జేయుచున్నావొ యీ
స్తుతియం దాదృతి కేమి? యేను మిగులన్ శుష్కించుచున్నాఁడ, నన్
గృతకృత్యున్ బొనరింపు మింకనయినం గేల్మోడ్తుఁ గామేశ్వరీ॥

శా॥ 'నాకై యింత తపమ్ము మున్ను సలిపె న్నాతండ్రి, నే భక్తిచే
నాకష్టమ్మును దీర్చికోవలయు' నం చామీఁద నాబిడ్డ దా
నాకైంకర్యమునం గడంగుట కిటుల్ నాకైతఁ బ్రాఁకింతె? మే;
లీకావ్యార్థ మెఱుఁగువిద్య రుజ యె ట్లీనిచ్చుఁ? గామేశ్వరీ॥

మ॥ కవితాపుత్రులతోడఁ దృష్టిపడి యేఁగాలమ్ము పుచ్చంగ, నీ
తెవులుం గొంటుకుమారు నిచ్చి ననుఁ గుందింపంగ నీ కర్హమే?
శివ వాఖ్యాకృతులందు, భర్త శివుఁడై చెల్వారు, మీవంటివా
రవివేకంపుఁ గృతుల్ పొనర్చు టది యన్యాయంబు కామేశ్వరీ॥

మ॥ 'కవితాగోష్ఠి త్యజించె వీఁ డిపు డెవో కల్పించినంగాని త
ద్వ్యవసాయమ్మునకుం గడంగఁ' డని నీవాత్మన్ విచారించి యీ
తెవులున్ గల్పనచేసి సారె కిటు లెంతేఁ గ్రైత సాగించెదే?
భువి, 'మార్జాలపుఁ గేళి యెల్క కుసురు ల్పోఁగొట్టుఁ' గామేశ్వరీ॥

మ॥ కవితాసంతతి దుర్భగప్రతతిసంగం బాచరింపంగ న
య్యవివేకమ్మున రోగమంటికొన నే నద్దాని వెన్వెంటనే
సువివేకమ్మునఁ బాఱఁ దోలితి, నికన్ సూనున్ గడున్బ్రోంచునీ
తెవులుం దోలవలెం గవిత్వమున నిన్ దేలించి, కామేశ్వరీ॥ ౧౨౭

మ॥ కుజునందున్ గుజుఁ డేగె, రాహు వీఁక నేగున్ రెండుమాసాల, కీ
కుజరాహుల్ పరికించి చూచిన మహాక్రూరుల్, స్వతస్సౌమ్యుఁడై
విజయం చేయు నికన్ బృహస్పతి, సుఖావిర్భూతి నీ విస్మహా
ద్విజునంతర్దశ నే నొసంగి కొమరున్ దీవింపు కామేశ్వరీ॥ ౧౨౮

శ్రీ రస్తు - నిరోగశతాయుష్య మస్తు.

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి ప్రథమపుత్రుఁడు కామేశ్వరుని
జన్మపత్రిక.

| | | |
|---|---|---|
| శ | | రా |
| | రాశి | గు |
| శే చ | ల | ర బు శు శు |

| | | |
|---|---|---|
| చ కే | శు | ర |
| శు | అంశ | |
| గు | బు | శ రా |

స్వస్తిశ్రీ ఆనంద సం॥ మార్గశిర్ష బ ౯ శుక్రవారము రాత్రి గం 2-47 నిమిషములకు జననము. లగ్నము తుల, నక్షత్రము హస్త, చరణము తృతీయము, జననకాల చంద్రమహాదశాశేషము ౨ సం॥ ౮, ౧౦ నెలలు, ౧౯ రోజులు.

శా॥ ఆరోగం బెటుతగ్గు? బిడ్డనకి, న్యాయినో డెటుల్ వోవు?, నా
యారాటం బెటుతీఱు? నీకినుక నీయవ్యాజకారుణ్య మే
పాఱంగా దోలవలెన్, భిషగ్వరులు తీర్పంజాలకున్నారు, ని
న్నారాధించితి, నాతనూజునకు సౌఖ్యంబిమ్ము కామేశ్వరీ॥ ౧౨౯.

మ॥ 'కలుగుం బుత్రులవల్ల మోక్ష' మనివక్కాణించు శాస్త్రమ్ము ని
శ్చల, మాతల్లిద్భవుఁగూర్చికాదె? యిటు లాసాయమ్ము నీధ్యానమున్
సలుపం బూనితి నంబరో? యిదియు మోక్షప్రాప్తికే కాక యీ
యిల సౌఖ్యమ్ములకెల్ల నెల్లయగుఁగాదె? దేవి? కామేశ్వరీ॥౧౩౦

మ॥ జననీ? గుత్తిపురమ్మునుండి యనిపెన్ జక్రాలవంశ్యుం డొకం
డు నృసింహాఖ్యుఁడు భవల్లలాటధృతసిందూరమ్ము నాఁ బొల్చుమం
దు నెదే, నయ్యది చక్రిమై మలపి యీదోరోగరక్షస్సు; నా
తనూహాఖ్యను వెల్గె నీకృప కిదే తార్కాణ కామేశ్వరీ॥ ౧౩౧.

మ॥ నినుఁబూజించెడిపట్ల, నేత్యాణముసేవిన్ దాన మెవ్వారికే
ని నిడంబోయెడిపట్లఁ, బుత్రు రుజయే 'నే నుంటి' నంచున్ మదిన్
దనుకం శల్యముపోలె మత్సుకృత మేతద్వ్యాధికై సర్వమున్
వినియోగింపుము, నీవు సాయపడి దీనిన్ దింపు కామేశ్వరీ॥

శా॥ వ్యాపారాంతరమగ్నమానసు భవద్భక్తు న్ననున్ నేద్పుమై
నీపాదమ్ములవంకఁ ద్రిప్పుటకు నీనీచామయవ్యాజ మొం
డాపాదించి తనూజునిం గలఁచెదే, నన్యాయ మట్లైనచో
నే పాపమ్ము నెఱుంగనట్టిఁడుకదా? యీకుజ్జ కామేశ్వరీ॥ ౧౩౩

శా॥ సంతానంబన? నాఁడు శ్రీదశరథుఁడ్మాజాని తాఁ గాంచె, నా
సంతానమ్మును బోలినట్టి దెచటన్ జన్మింపనే లేదు, త
త్సంతానమ్మున నాతఁ డేసుఖము గాంచన్నేర్చె? యోజించినన్
'సంతానంబు సుఖప్రదం' బనుట యుక్తోక్తి కామేశ్వరీ॥ ౧౩౪

శా॥ సూత్రప్రాయముగాఁ బ్రవర్తనము నెచ్చోఁ జేయునా కీదృశున్
బుత్రుం గల్పనఁజేసి సారె విసువుం బుట్టింతువే? నీకృపా
పాత్రుండంగదె? తల్లిరో? సుతు నెటో ప్రారబ్ధకర్మార్తు న
ద్గాత్రున్ బూర్ణబలున్ బొనర్చి యిటుపైఁ గాపాడు కామేశ్వరీ॥

శా॥ కాలం బింకను దీఱకే మునుపు స్వర్గంబేగ నాప్రాణముం
బోలంజాలినవాఁడు తిర్పతి, సుఖంబుం బొందుచున్నాఁడు నా
కాలం బీగతి నేగుచున్నది వృథా కష్టమ్ములపాలై, సుతుం
బాలింపంగదవమ్మ? రోగము త్యజింపంజేసి కామేశ్వరీ॥ ౧౩౬

మ॥ 'వటుగుంజేయుద' మన్న పిలోసఁగ దీశ్వాసామయం బిట్టియా
చెడురోగమ్ము వివాహమున్ సలుపువానిన్ సూర్చు పెట్టమ్మ? నీ
యశుగుల్ మొక్కెద దీని కేదొ యొకమందుంచున్ గనంజేసి నా
కొడుకుం బ్రోవఁగదమ్మ? నీకొడుకు బాగుం గోరి కామేశ్వరీ॥

మ॥ ఋతువుల్ వచ్చుచుఁ బోవుచున్న వొకటేరీతిన్ రుజాశాంతి యే
ఋతువున్ జేసినయట్లు లేదు; సుఖమై యెప్డేని బిడ్డండు వ
ర్ధితుఁడౌనే? కలనేని దెల్పుము, మనోదీనత్వమున్ బాపు, మా
శ్రితుఁడన్నీకు ననుగ్రహింపుము సుతశ్రీ నిల్పి కామేశ్వరీ॥ ౧౩౮

శా॥ 'అల్లుం డీతఁడు మా' కటంచు సుతుఁ గన్యాదాత లాడంగ, నా
యుల్లమ్మెండొకభంగి నుండు, నలవా రుత్సాహమున్ జూప నే
నెల్లన్ మిన్నకయుందు, నీరుజకు నేమే నడ్డు కల్పించి త
త్సల్లాపమ్ముల కుత్తర మ్మిడుమనుకుల్ సాగింపు కామేశ్వరీ॥ ౧౩౯

మ॥ ధరలో 'దుష్కరమస్త్రప్రభృతులో తత్తన్మహాకార్యముల్
నెఱవేఱున్ దప మాచరించుకతన న్నిక్క' మ్మటంచున్ భవ
చ్చరణారాధన సల్పుచుంటిని యథాశక్తిన్, గుమారామయో
త్తరణం బెంతకు రాపమేని యిఁక సిద్ధం బంబ? కామేశ్వరీ॥ ౧౪౦

మ॥ ఒకపద్దెమ్మున కొక్క-యేడయిన నాయుర్దాయ మీఁ జాలుప
ద్యకదంబంబును నూటనల్వది యిదే యర్పించితి న్నీ కిటన్
సుకమున్ గూర్ప సగమ్ము కర్పయిననున్ నూన్యాయువౌ డెబ్బదిం
టికిఁ బై, నఁతియ చాలు సౌఖ్యగరిమన్ దేలింపు కామేశ్వరీ॥౧౪౧

శా॥ నిన్నుం గా దిట్టుటయుం ఘటించెఁ గొమరున్నేఁ డుద్వ్రదుత్పీడను నేఁ
గన్నారం గననేర కార్తియుడుపంగాఁజాల కోయమ్మరో?
"యిన్నింద్యంపుఁబసం బొనర్చునను నీవే చంపి రక్షింపు మా
పన్నుం మత్సుతు నార్తిఁబాపి" యనుచుం బ్రార్థింతుఁ గామేశ్వరీ॥

శా॥ అయ్యయ్యో? యిదియేమిపాపము? కుమారాంబా సుతుల్లేరె? నీ
కియ్యార్తిం శిశు వెట్టుసైఁపఁగలఁ డీ క్లేశ్వింతువే? భక్తులం
గుయ్యాలింపవె? యింతఘోరకలియే? కొంతేనిఁ జింతింపవే?
న్యాయ్యంబేకద? నా కిటుల్ సలుపుటల్ నాతల్లి? కామేశ్వరీ॥

మ॥ కడుపెల్లం జెఱువౌను గట్టి వడునీకష్టమ్ము వీక్షింపఁగాఁ
గొడుకే కా దొకశత్రువే యను మిదేక్రూరుండు సైరించు? నీ
యడుగుల్ గొల్చెడినాకు నీ విటులు ప్రాయశ్చిత్తమున్ జేసెదే?
తడఁబాటో? దయలేదొ? నిం గొలుచుటే తప్పౌనొ? కామేశ్వరీ॥

శా॥ 'సంతాన మ్మది వల్వ దేరికి నిఁకం సంతానమే వద్దు నే
సంతానమ్మును గాంచుమీఁద మిగులం సంతాపమున్ గంటి నా
సంతాపమ్మును దీర్ప నిప్పటికి మాశర్వాణికిం గా' దటం
చెంతో దీనముగా వచించుటది నీ కిష్టంబె? కామేశ్వరీ॥ ౧౪౫

మ॥ "గురువంతర్దశనుండియైన రుజకుం గోపోపశాంతిన్ శివం
కరమారీతి ననుగ్రహింపు" మని వెన్కన్ గోరియున్నాఁడ, ని
త్తరి యుద్రేకము చూడనంతదనుకన్ దాళండు బిడ్డండు శాం
కరి? యీలోపునఁ గొంతశాంతి నెటులో కల్పింపు కామేశ్వరీ॥

మ॥ త్రుటి యొక్కొక్క యుగమ్ముగా నకట? పుత్రుం డుండె నో యమ్మ? సం
కట మంతంతకు హెచ్చి విచ్చలవిడిన్ గారింపఁగాఁ జొచ్చె నిం
తట నీ వడ్డముసొచ్చి రాహుగుణమున్ దగ్గించి యొక్కింతయు
క్కటికమ్మున్ బ్రకటించినన్ గలుగు సౌఖ్యం బంబ? కామేశ్వరీ॥

శా॥ నాకున్ సంస్కృతియం దనాదరము గన్పట్టంగఁ బుట్టించితే?
పీఁకన్ పీనిఁ గుమారుఁ గాఁ బ్రతినిశన్ వీఁ డందు శ్వాసామయో
ద్రేకమ్ముం గని యోర్చు టెట్లు? కరుణోత్సేకమ్ము నూకొల్పి నా
శోకమ్మున్ సుఖపెట్టి నా కిడుము సంతోషంబు కామేశ్వరీ॥ ౧౮౮

మ॥ తమ ఆఖ్యాకుఁడు రాహుదుర్గ్రహము బల్ దర్పమ్మునన్ బొంగి ము
ఖము రెట్టించుఁ గుమారుపట్ల నిశలన్, గళ్యాణిరో? రాత్రిభా
గములం దెక్కుడు నీసహాయ మది నేఁ గాంక్షింతు, బిడ్డండు బి
క్కమొగంబై ధృతి దూలకుండనయినం గాపాడు కామేశ్వరీ॥

శా॥ గంటల్ రాతిరి యెన్ని కొట్టఁబడెనో? కళ్యాణిరో? వాని న
న్నింటి న్నే వినుచుంటిఁ బుత్రుకతన, న్నీసత్కృపాస్ఫూర్తి యే
వెంటన్ దాఁ బ్రసరింపదయ్యె, నెటులన్ వేగింతు నీకుట్టితో
నింటన్ గాపుర; మార్తిఁ బోకడపరాదే? తల్లి? కామేశ్వరీ॥

శా॥ ఏదో మంచిఫలమ్ము నీకతన నా కీపద్యముల్ తెచ్చుఁ ద
త్ప్రాపదుర్వ్యాధి సుతామయప్రశమరూపంబే యగున్ దానిచే
నా దౌర్భాగ్యము శాంతిఁ జెందు, సుఖము న్నా కబ్బు నీకన్న? 'నే
తాదృగ్దైవత మెందు లే' దనుమహత్త్వం బబ్బుఁ గామేశ్వరీ॥

మ॥ 'ఇలువేల్పంచును గొన్నిగోత్రములవారే త్వత్పదాంభోజపూ
జలు సేయన్ గమకింత్రు ము, న్నిపుడు నాసంతానముం బ్రోచుచో
నిలయెల్లన్ భవదర్చకప్రకరమై యేపారు, సంతానవం
తులు నీచే నగుచుందు రెల్లరుఁ గృతార్థుల్ తల్లి? కామేశ్వరీ॥

మ॥ మరాళి బైనఖ వన్మహామహిమముగా మాయింట నస్మత్పితా
మహి కామాంబికచేత వింటి మును పంబా? నీదునావేశ మ
మ్మహిళామాళి వహించి చిక్కడలునమ్మార్గమ్ములన్ జెప్పి యి
మ్మహి నీకుం దులలేనిం జెల్పెడిదిసుమ్మా? యమ్మ? కామేశ్వరీ॥

శా॥ 'నీపై నూరక యిన్నిపద్దెములు నే నిర్మింతునే? శ్రేయముల్
ప్రాపించున్ ధ్రువ' మంచు నామదికి ధైర్యం బబ్బెడిన్, రోగమో?
యేపింకన్ విడలేద, కారణ మదేమీ? రాహుదుశ్శీలమున్
బాపన్ రామిమొ? శ్రద్ధలేమిమొ? కృపాభావంబో? కామేశ్వరీ॥

మ॥ హిమవత్పుత్రి? గజాస్యషణ్ముఖసవిత్రీ? సర్వగీర్వాణరా
ట్ప్రమదారత్నసమర్చ్యమానచరణా? భద్రాత్మికా? భద్రదా?
శ్రమతాపాదిసమస్తరోగశమనీ ? సంతానసంరక్షిణీ ?
సుమనగకల్పలతా? సుతు న్మనుపుమీ? జోహారు కామేశ్వరీ॥౧౫౫

మ॥ శివదాత్రీ? శివదివ్యదేహచిరవాసి బ్రహ్మచర్యవ్రత
ప్రవిభేత్త్రీ? కమనీయగాత్రి? సకలాపద్దుర్గతాచ్ఛేత్త్రీ? స
త్కవయిత్రిష్టవిధాత్రి? భక్తజనసంతానార్తిసంహర్త్రీ? మ
త్కవనమ్మున్ గయికొమ్మ పుత్రునకు సౌఖ్యం బిమ్ము కామేశ్వరీ॥

మ॥ సకలేశాని? భవాని? శాంకరి? జగత్సంరక్షణాయత్తసాం
ద్రకృపాభాస్వర, సత్కవీశ్వరమనస్తాపాగ్నికాదంబినీ ?
వికచాంభోరుహనేత్ర? నీదయకు నువ్విళ్ళూరుచున్నాండ, బు
త్రకు రక్షింపఁగదమ్మ? గండ మెటులో దాటించి కామేశ్వరీ॥

శా॥ నీకారుణ్యముకల్మి శ్వాసమయమా నీచారి నిర్జించి తాఁ
బైకిన్ గుఱ్ఱఁడు వచ్చి వర్ధిలినచోఁ 'బ్రాణావశిష్టుండు వీఁ
డీకల్మిం గనె, నంబ్రసా' దనుచు నిన్నే యమ్మలక్కల్ నుతి
ప్రాకట్యమ్మునఁ జెప్పికొందురుసుమీ ? పల్మాఱుఁ గామేశ్వరీ॥

శా॥ నీకారుణ్యము కల్గుచే కడమకానీ, కల్గునల్లంతలో
దూఁకున్ డొంకలఁబట్టి రోగములు, డిందున్ దాపముల్ పాపముల్,
చేకూరున్ బల మాయువున్ సుఖము, సుశ్రీ వర్ధిలున్, లోపమే
లేకుండు న్నిను నే నెఱుంగుదును దల్లీ? ప్రోవు కామేశ్వరీ? ౧౫౯

శా॥ 'చాముండా' యనునామధేయము ద్వివత్సంహారముఁ జేసి యీ
భూమి న్నీకుఁ బ్రసిద్ధమై యెఱుఁగుదుర్ బుధార్తిసంహారమం
దేమాత్రమ్మును శ్రద్ధ కైకొనక న న్నీరీతి వేధించుచో
'చాముండా' బిరుదం బపార్థకముగా సాధింతుఁ గామేశ్వరీ॥

శా॥ ఏమాహాత్మ్యుఁడొ నన్ను వంటియొకఁ డేదేఁ గోర్కె కై వేడ నీ
పేమాంద్యమ్మును వానికోర్కె యెడ నిట్లే చూపఁగా, భక్తుఁ డు
ద్దామకోపిధముఁ బట్టఁజాలక నినుఁ దాఁదిట్ట నేమోకదా!
'చాముండా' యని; యింత నేనియుఁ గృపన్ సాగింపు కామేశ్వరీ॥

మ॥ మిగులన్ భక్తులఁ గష్టపెట్టు టిదియున్ మెచ్చానె? యట్లైనచోఁ
'దెగితే లింగఁడు రాయి' గాదె? మది కుద్రేకమ్ము గల్గించుటల్
తగునే? తల్లిరో? నిన్నువంటికరుణార్ద్రింబౌ మహామూర్తికిన్
బగవాఁడే? పసిపాప, నాకొమరునిన్ బాలింపు కామేశ్వరీ॥

శా॥ రెండేఁడుల్ చనవచ్చె, వ్యాధి యొకచేఁ రీతిన్ విజృంభించె, నా
కొండున్ మం దగుపట్టదయ్యె. భిషజుల్ కష్టించి లజ్జించి రు
ద్దండాక్రిప్రవృత్తిప్రవీణము భవద్దాస్యంబు తానంత వే
ఱొండు న్నాకిడె నీదుసేవ వృథగా దోయమ్మ? కామేశ్వరీ॥ ౧౬౩

మ॥ హిమవత్పుత్రిక వై ననిన్ గుఱిచి నే నిన్నాళ్ళు ప్రార్థింప మ
ద్భ్రమమున్ బాపఁదలంచి నీజనకభూప్రాంతమ్మునం దుండి యొ
క్క మహామూలిక పంపి తంబరో? యిటే కాకున్నఁ బంజాబుదే
శమునం దున్నయమూల్యమూలిక యెటుల్ సాధ్యంబు కామేశ్వరీ॥

శా॥ పంజా బెక్కడ? వేరదెక్కడ? మహాపద్వారకంబౌచుఁ దా
సంజీవిన్యవధానవల్లరియనన్ సంప్రాప్త మాటెడ? యా
ర్తిం జూఱంగొనుటెడ? యంబరో? భవచ్ఛ్రీపాదముల్ పద్యపుం
బుంజంబుల్ రచియించి కొల్చుఫల మీపున్నెమ్ము కామేశ్వరీ॥

మ॥ తనసోదర్యనిశ్వాసకాసల నెటుం దా మాన్పకో లేక యం
బ? నినుంగొల్చెడి నన్నుఁబోలె నలబర్మాడాక్ట రుండంగ, నా
తని కీవేరు లభించె, నా కిది యయత్నప్రాప్తమయ్యెన్ జిరం
తనపుణ్యంబున నీకృపాగరిమ చేతం దల్లి? కామేశ్వరీ॥ ౧౬౬

శా॥ బర్మాడాక్టరుసోదరుం డొకరుఁ డల్పప్రాయపుంగుఱ్ఱఁ డో
శర్మాధాయిని? నాదుషడ్డకుని శిష్యవ్రాతమం దుండె నీ
మర్మం బాతఁడు వానిచే నెఱిఁగి తన్మాత్రార్తికై కైకొనెన్
గర్మాంతమ్మయి నాకు భాగ మచటన్ గల్పించెఁ గామేశ్వరీ॥

మ॥ మణిమంత్రౌషధశక్తు లెంతయు నసామాన్యంబు, లీశక్తు లే
యణుమాత్రంబును గోచరింపవుసుమీ? యంబా! భవత్సేవకా
గ్రణులం దక్కఁ దదన్యులందు, నిజమిక్కాలమ్మునంగూడ ని
మ్మణిమంత్రౌషధశక్తి నీకొలుపు సంపాదించుఁ గామేశ్వరీ॥ ౧౬౮

శా॥ ఏవే రీశ్వరవేరు శ్వాసరుగపహిస్వేచ్ఛాఃరోధమ్మునం
దావే రున్నది నీమపుట్టిఁలుచాయన్ దాని నేయోగియో?
యూప్రంబోలె నెఱుంగు? నింతనె జగం బేరీతి జీవించు? నో
దేవీ? యీకృతి కట్టిశక్తి నిడి పృథ్విన్ బ్రోవు కామేశ్వరీ॥

శా॥ దేనిన్ గంఠమునన్ ధరించు నెడ నుద్రేకింపకే శ్వాసకా
సానూనార్తి యడంగు నయ్యది యమూల్యంబైన వేరద్దియే
నీనామాంకితమైనకావ్య, మని దీనిన్ బండితుల్ మెచ్చుకోఁ
గా నీ వీకృతికిన్ మహత్త్వ మొసఁగంగాఁ గోర్కి కామేశ్వరీ॥

మ॥ మును నన్నుఁ గనుచుండ్రి నాకవనముం మాచూడఁగాంక్షిం
[చి, యో
జననీ? యిప్పుడు 'శ్వాసకాసల నడంచ న్నేర్తుఁబో!' యంచు
ర్థనముం జేయఁదొడంగి, రేమిగతి? యీసత్కావ్యమం దట్టి శ
క్తిని వేర్వేల్లఁడులందుఁబోలె నిడి ఖ్యాతిం దెమ్ము కామేశ్వరీ॥
మ॥ పడిసెంబో, తలనొప్పియో, జ్వరమొ సంప్రాప్తించుచో వైద్యుల
దడవం లాభము గల్గినం గలుగు దుర్దాంతవ్యథాభారముల్
గుడువన్ దాపగుచో నరుం డెఱిఁగి తాఁ 'గుయ్యో మొఱో' ?'
[ యంచు నీ
యడుగుల్ వట్టుటయే రుజాపనయనోపాయమ్ము కామేశ్వరీ॥
శా॥ ఏ నేపాటి? సమస్తకారణుఁడు శ్రీకృష్ణుండు మున్నాత్మసం
తానార్తిన్ దొలఁగించుపొంటె నిను బల్ దైన్యమ్ముమై వేఁడి ని
చే నాకోర్కి లభింపఁగా సుఖము వాసిం గాంచి సంసారియై
తా నెందున్నగఁజెన్ భవచ్చరణముల్ ధ్యానింతుఁ గామేశ్వరీ॥
మ॥ ఇహమందు న్నినుఁగొల్చువారలకు సర్వైశ్వర్యముఖ్యమ్ములౌ
బహుసంపత్తులు గల్గు, వ్యాధు లుడుగున్, ప్రఖ్యాతి వర్ధిల్లు, దు
స్సహ మేవారికిఁగల్గ దింకఁ బరమో? స్వర్లోకమున్ మించుఁబో?
యహాహా? నీచరణార్చనం బిడుసుఖం బవ్వారి కామేశ్వరీ॥ ౧౭౪
శా॥ ఇక్కట్టేదియొ నాకుఁ జేకుఱియు, నాయిక్కట్టు నాపట్ల స
మ్యక్కీర్తిప్రదకార్యహేతువుగ బాల్యమ్మాదిగా మాఱు నో
యక్కా? యట్టులె యాత్మజాతురుజ నీయవ్యాజపుంబేర్మి చేఁ
జక్కన్ ప్రస్ఫుక్కి సుకావ్యరూపమున మించంబోలుఁ గామేశ్వరీ॥
మ॥ ఒకయిక్కట్టున విద్య, వేఱొకట విద్యోద్రేక, మింకొక్కటన్
సుకవిత్వమ్ము, మఱొక్కటన్ సుకవితాస్తోకత్వసామగ్రి, వే
ఱొకటన్ యోగము, భోగమో? మఱియు నింకొక్కంట, నీపేర్మిఁజే
స్తి కడుం గస్తి సుఖాకృతిన్ బరిణమించెం దల్లి? కామేశ్వరీ॥




# ఆరోగ్య కామేశ్వరి

శా॥ దారిద్ర్యమ్మున నేమి, జవ్వనపుదుర్దర్పమ్ము చే నేమి,
ధీరత్వమ్మున నేమి, సర్వమున నేదేఁ జిక్కు వాటిల్లినా
యార్తుల్ పాడసూపియున్ దుదకు నీయవ్యాజపుం బేర్మిచేఁ
బేరై మేటిప్రతిష్ఠలై యవి ననున్ బ్రేమించెఁ గామేశ్వరీ॥ ౧౭౭

మ॥ అటులే నేఁడు కుమారుదూరుజయు నీయవ్యాజపుంబ్రేమచే
నిటు లేతత్కృతిరూపమై సుఖముఖానేకక్రియోదారమై
స్ఫుటకీర్తిన్ ఘటియించుసూచనలు రేపున్ మాపుఁ దోఁచున్ భవ
ద్ఘటనం బెవ్వఁ డెఱుంగు నెన్నొనరుపంగా లేవు? కామేశ్వరీ॥ ౧౭౮

మ॥ అల సత్యవ్రతుఁడా సుదర్శనుఁడు నేమానట్లు మున్ దోఁచి ర
వ్వల నేమైరి? భవత్కృపావశత, నేవ్యాధుల్ మఱే చిక్కులున్
గలఁచన్నేరవు నీకృపావశుల, నిక్కమ్మింత, మత్పుత్రునీ
ఖుల సత్యవ్రతుఁగా, సుదర్శనునిగా నీక్షింపు కామేశ్వరీ॥ ౧౭౯

శా॥ ఆయుశ్శ్రీబలదాయకంబులు త్వదంఘ్ర్యంభోజరేణుచ్ఛటల్
నాయందున్ బ్రసరించినందులకు నానాఁటన్ సుతుం డామయా
పాయమ్మున్ గడఁదోసి వృద్ధికిరవై భాసిల్లుచున్నాఁడు నీ
సాయం బూరకపోదు భద్రముల నిచ్చల్ గూర్చుఁ గామేశ్వరీ॥

శా॥ 'గ్రామారిష్ట మడంగఁజేయు' మని త్వత్కాంతు, న్నినున్ 'బుత్రకున్
గామేశాఖ్యు నరుగ్ణుఁజేయు' మనియున్ గావ్యోక్తిమూలమ్మునన్
మీమీమంచి గణించి వేఁడితిని నన్ మీ రర్థి మన్నించినా
ర్మమే లెల్లెడ నేను జెప్పికొనెదన్ మిన్ముట్టఁ గామేశ్వరీ॥ ౧౮౧

శా॥ నీ వాపత్తులపట్ల సాయపడినట్లే సంపదర్థమ్ములన్
రావు శ్రీకులరత్నభూషణము శ్రీరామాంబ సాహాయ్యమున్
గావింపన్ వెనుదీయ కోమెడి ననున్, గళ్యాణి? యమ్మాతృకన్
భావింతున్ 'భవదంశ' మంచు మది సంభావింతుఁ గామేశ్వరీ॥

మ॥ చదువుల్ నేర్చితి దిగ్విజేతనయి యాచంద్రార్క భాస్వద్యశః
పదమై మించితి భాగ్యపుంగరిమతో భాసిల్లితిన్ గండముల్
తుదముట్టించితిఁ గంటి సంతతిని సంతోషించుచుంటిన్ భవ
త్పదదాస్యం బొడఁగూర్పలేని దొకభద్రం బున్నె?· కామేశ్వరీ॥

మ॥ శశిశేషం బయిదేండ్లు భూసుతదశాసంవత్సరా లేడునున్
కృశతాకారక మౌచు వ్యాధి మిగులన్ క్లేశంబు గల్పించె, నా
ర్తిశమారంభము రాహు వాదినె ప్రసాదించెన్ సమస్తంబు నీ
వశ మన్నింటికిఁ దల్లి; నీయదియ మాభారంబు కామేశ్వరీ॥ ౧౨౪

శా॥ ఏమాత్రంబు వివేకమున్న మనుజుండేనిన్ గృహాపత్యభూ
రామారామమయంబు సంసృతియెడన్ రాగిల్లుటే తప్పు, త
త్కామ్ముల్ గొండొక నీపదాంబుజములన్ ధ్యానించుచో సంతత
క్షేమం బబ్బెడి, దక్కువారి కసదా సేమంబు కామేశ్వరీ॥ ౧౨౫

మ॥ కొడుకుల్ గూఁతులు నేఁగురిప్పటికి నాకున్ నీకృపం గల్గి రే
యెడ విద్యాంద్ర నమగ్రహించుటయు నాయీనన్ను దైన్యంబు పా
ల్పడకుండన్ దగఁ జూచుచుండుటయు నిన్ బ్రార్థింతు నోయమ్మ? నీ
యడుగుల్ గొల్చెడిదాసదాసులకు దాస్యార్హుండఁ గామేశ్వరీ॥

మ॥ అతిచిత్రంబు భవచ్చరిత్రము, తదీయంబైన మాహాత్మ్యప
ద్ధతి వర్ణింపఁగ నాకు శక్యమగునే? తల్లీ? సుతున్ మున్ను దు
స్స్థితిలో ముంచినవ్యాధి యిప్డు నుడిఁగెన్, దేహమ్ము నానాఁట వ
ర్ధితమయ్యెన్, గళ, కాంతు, లుప్పతిలె సుశ్రీ మించెఁ గామేశ్వరీ॥

శా॥ నాయంత్రైనను గాకయున్న నెటులో నాపుత్రుపై నీకృపా
వ్యాయామం బుదయించు నక్కతన విద్యాస్ఫూర్తి యవ్వానికిన్
స్వాయత్తం బిఁకఁగాకతీరదు, రజాహంకార మింకేపయిన్
ఛాయన్ గూడ స్పృశింపకుండునటులన్ శాసింపు కామేశ్వరీ॥ ౧౨౮

శా॥ అంబా? నీదయ కంతులేదుగద? ప్రత్యక్షంబుగా రాత్రి స్వ
ప్నంబందుం బొడకట్టి, తేదియు శుభావాప్తిం భవన్మూర్తి దృ
ష్టంబై తెల్పుట నిక్క, మయ్యది సుతశ్వాసామయోచ్ఛిత్తి క
న్యంబై యుండదు, నాదునిశ్చయము తథ్యంబౌతం గామేశ్వరీ॥

మ॥ వసుగుం జేయఁగనీలులే దనినమావానిం భవత్సత్కృపా
జడధిస్నానము నేఁడు పెండ్లికొడుకుం జల్పించి యుత్సాహ మె
క్కుడుగా నా కొడఁగూర్చె, నీదునడుగుల్ గొల్వం మొదల్ వెట్టి యె
వ్వఁడుగానీ చెడిపోఁడు భద్రములు సంపాదించుఁ గామేశ్వరీ॥

మ॥ పరమాదృష్టము పెట్టిపుట్టినటు లే భావించి గర్వింతు దు
స్తర మీహాంతరశక్యమ్మనం దితరభావం బొట్టకై నేర్వ కే
సురభావం బఠియించి యక్కతన సంస్తుత్యుండనై మించితిం
సిరియుం సంపదగూడ నీకరుణచేఁ జేకొంటిఁ గామేశ్వరీ॥ ౧౯౧

మ॥ కలిగెం "లే" దనుకొన్నసంతతియు, భాగ్యం బబ్బె, నానందసం
కుల మయ్యెం జని, షష్టిపూర్తియును నాకుం దాపుగావచ్చె నో
లలితాంబా? యిఁక నొక్కకోర్కి, యది వాలాయమ్ము మద్విద్య ల
ర్మిలి మత్పుత్రులయం దమర్చుటయె సుమ్మీ తల్లి? కామేశ్వరీ॥

మ॥ కల రిక్కాలమునం దనేకులు ధనాకాంక్షాపరిధానమ్ములా
పలువిద్దెల్ పఠియించి యక్కతన సంపన్నత్వముం గాంచి పు
త్రులఁ దద్విద్యలయందుఁ జొన్పడియుహార్థుల్; నాకుఁ బ్రాచీనవి
ద్యలయం దెక్కుడునాదరం బగుట నిట్లర్థింతుఁ గామేశ్వరీ॥ ౧౯౩

శా॥ "విద్దెల్ ద్రవ్యముకోస" మన్నను డికిం విజ్ఞుల్ పరిమోదింప రే
పార్ద్రో దేననొ పొట్ట నింపికొని రేపుం మాపు సద్వ్యాపృతిం
దద్దం గాలముపుచ్చుటే ద్విజులకుం ధర్మమ్ముగాఁ బూర్వపుం
బెద్దల్ సెప్పిరి; నేను వారినుడులే ప్రేమింతుఁ గామేశ్వరీ॥ ౧౯౪

మ॥ ఒకసిద్ధాంతి లిఖించె ‘షష్టి’ యని వేఱొక్కం డశీత్యబ్దముల్
ప్రకటించెన్ మఱి నాకు నాయు వెది సంభావ్యంబు? షడ్ద్వయా
సకుఁగూడన్ గ్రహవృత్తి సాధకముగా నాబుద్ధికిన్ దోఁచు దే
సిక్రీ బాగ్రిమాణ్యమొ నాకెఱుఁగఁదరమే? నిక్కంబు కామేశ్వరీ॥

మ॥ అరయన్ షష్టియె యైనచోఁ బ్రకృతదేహస్వాస్థ్యమే చాలుఁ,ద్వ
త్కరుణోద్రేక మశీతిదాఁకఁ జనుచో దార్ఢ్యమ్ము సంపాద్య మే
వెరవో దానికి నీవ చూడవలెఁ ద్వద్వీక్షామృతం బబ్బుచో
నొరుమన్ దేహబల, మ్మనామయత నాయుస్సొందుఁ గామేశ్వరీ॥

శా॥ “ఆయుస్సెక్కుడుగా నొసంగు” మని నిన్ యాచింప నోతల్లి? యే
గాయాసమ్మును లేనిజీవితము నే యాచింతుఁ నేఁడ్మెచ్చి; యో
శ్రేయోదాయిని? నామతప్పిదము లార్తిన్ బోలెఁ బోకార్పు,మా
మ్నాయధ్యేయము త్వత్పదద్వయ మెదం బాటింతుఁ గామేశ్వరీ॥

శా॥ అంతో యింతయొ విద్య నిచ్చితివి, లోకారాధ్యుఁ గావించి, తా
శాంతశ్రాంతయశం బొసంగితి, వపత్యైశ్వర్యముల్ గూర్చి, తే
మంతుల్ సేసిన నన్నుఁ బుత్రునిబలెన్ మన్నించి రక్షించి, తే
చింతల్లేనిత్వదంఘ్రిసేవన మిఁకన్ జేకూర్పు కామేశ్వరీ॥ ౧౯౮

శా॥ కళ్యాణంబు లొనర్చు టొప్పుఁగద? శోకం బిచ్చియున్నప్పుడో
కళ్యాణీ? యిది నీ వెఱింగినదియే కాఁబట్టి సుంతేని వై
కల్యం బేర్పడకుండ నాదుప్రకృతిన్ గాపాడు మోయమ్మ? నా
ఫల్యం బప్పుడు నాదుసంస్కృతికి సంప్రాప్తించుఁ గామేశ్వరీ॥ ౧౯౯

శా॥ ఏమో నీదయ యెట్లువచ్చిన సరే, యీనన్ను నీభక్తుఁగా
సామాన్యప్రజలున్ మహామహులు నిచ్చల్ మెచ్చికొంచున్నరు, నా
క్షేమంబెల్ల భవద్వశంబ, యెటు వాసిన్ గూర్చి రక్షించెదో?
ప్రేమింపం దగువాఁడనేని దఱితోఁ బ్రేమింపు కామేశ్వరీ॥ ౨౦౦

శా॥ ఆశ్వాసాంతముదాఁక శ్రావ్య మగు కావ్యంబట్టులే జీవితం
బాశ్వాసాంతముదాఁక రమ్యమగుచో నాశాస్యమై సవ్యమై
శశ్వన్మంగళసంగతంబునయి విశ్వశ్రేయమై పొల్చు నో
విశ్వేశీ ? యటులౌట సారె కిటు నావిజ్ఞప్తి కామేశ్వరీ॥ ౨౦౧

మ॥ ఇహసౌఖ్యం బనుభూత మాయె, సగ మాయెన్ భుక్త, మోయమ్మరో ?
గ్రహవర్గాయువునందు, నాకు నిఁక భోగ్యం బెంతకాల మ్మను
గ్రహపూర్వంబుగ నీ వొసంగెదవొ ? తత్కాలంబు జ్ఞానోదయ
స్పృహణీయం బగునట్లొనర్చుటయె నాసేమంబు కామేశ్వరీ॥ ౨౦౨

మ॥ ఇల దీనిన్ బఠియించువారికి సుఖ మ్మేకాలమున్ గల్గు వా
రల సంతాన మనామయ మ్మగుచు దీర్ఘంబైనయాయుస్సుతోఁ
జెలఁగున్, వాండ్రకు విద్యయు న్విభవమున్ జెన్నారు,నాకల్పమున్
గలిసంహారకమంత్రమై యలరు నీకబ్బంబు కామేశ్వరీ॥ ౨౦౩

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఇది శ్రీ తిరుపతివేంకటీయ మగు

నారోగ్యకామేశ్వరి

సమాప్తము.

సర్వే జనా స్సుఖినో భవంతు.



చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.